346



సాహిత్య మాసపత్రిక

# స్రవంతి

* కస్తూరి వేణుగోపాల్
* చల్లా రాధాకృష్ణశర్మ
* డా॥ ముదిగొండ వీరేశలింగం
* ఆలపాటి సుబ్బారావు
* సోమసుందర్

* డా॥ కోవెల సుప్రసన్నాచార్య
* పోతుకూచి సాంబశివరావు
* పోలాప్రగడ సత్యనారాయణ
* రఘువర్మ



# శ్రీ ఖిమిశెట్టి వెంకట్రామయ్యగారి నిర్యాణము

కర్నూలు నగరంలోని ప్రముఖ వ్యాపారి దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్ర ప్రస్తుత కార్యవర్గ సభ్యులుగా ఉన్న శ్రీ ఖిమిశెట్టి వెంకట్రామయ్యగారు అకస్మాత్తుగా నెల్లూరులో నిర్యాణము చెందినారు వారి నిర్యాణమునకు ఆంధ్రసభ మరియు ఆంధ్రప్రదేశ్ నందలి వేలాది హిందీ ప్రచారకులు ప్రగాఢ సంతాపమును ప్రకటించుచు వారి ఆత్మకు శాంతిని ప్రసాదించమని పరమేశ్వరుని ప్రార్థించుచున్నారు




సాహిత్య మాస పత్రిక

# 346

జనవరి 1983 సంపుటి 29 సంచిక 10

వార్షిక చందా పది రూపాయిలు విడిప్రతి ఒక రూపాయి

సంపాదకులు

డా. సి. నారాయణరెడ్డి

వేమూరి ఆంజనేయశర్మ

చిర్రావూరి సుబ్రహ్మణ్యం

# ఈసంచికలో





సంపాదకీయం

# ఆంధ్రప్రదేశ్ హిందీ సమ్మేళనం

ఆంధ్రప్రదేశ్‌లో గత అరవై నాలుగు సంవత్సరాలుగా హిందీ భాషా ప్రచారం జరుగుతున్నది అనేక సంస్థలు హిందీ ప్రచారం చేస్తున్నవి స్వాతంత్ర్యం లభించిన తరువాత ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత రాష్ట్రంలో వివిధ ముఖాలుగా హిందీకి సంబంధించిన కార్యకలాపాలు జరుగుతున్నవి రాష్ట్రప్రభుత్వం తన విద్యావిధానంలో త్రిభాషా సూత్రాన్ని భాగంగా చేసి మాధ్యమిక ఉన్నత పాఠశాలల స్థాయిలో హిందీని అనివార్య పాఠ్య విషయంగా చేసింది దక్షిణ భారత హిందీ ప్రచారసభ హైదరాబాద్ హిందీ ప్రచారసభ వంటి స్వైచ్ఛిక సంస్థలు వేలాది హిందీ ప్రచారకులద్వారా బాలబాలికల నుండి ప్రౌఢ వయస్కుల వరకు హిందీ భాషను నేర్పుతున్నవి రాష్ట్రంలోని ఆంధ్ర ఉస్మానియా శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయాలలో హిందీ విభాగాలు ఏర్పడి పనిచేస్తున్నాయి హైదరాబాద్‌లోని కేంద్రీయ విశ్వ విద్యాలయంలో కూడ హిందీ విభాగం ఉన్నది ఇవిగాక దక్షిణ భారత హిందీ ప్రచారసభ స్నాతకోత్తర విభాగము ఉన్నది వీటన్నిటిలో ప్రతి సంవత్సరం వందకు పైబడి ఎమ్ ఏ, ఎమ్ ఫిల్ పి హెచ్ డి పట్టాదారులు తయారగు చున్నారు రాష్ట్రంలోని వందలాది డిగ్రీ జూనియర్ కళాశాలలలో హిందీ బోధనకు అవకాశాలు ఉన్నాయి ఉన్నత పాఠశాలలు మొదలయినవి కూడ పనిచేస్తున్నాయి

బోధనేతర రంగాలలో దైనిక వార పాక్షిక మాసిక మొదలయిన పత్రికల ప్రచురణ రాష్ట్ర రాజధాని నుండి జరుగుతోంది రాష్ట్రంలో హిందీలో మౌలికంగాను అనువాదరూపంగాను గ్రంథ రచనలు చేసేవారు వందలాది మంది ఉన్నారు వీరిలో కొందరు గ్రంథాలను స్వయంగా ప్రచురించుకొంటు న్నారు కొన్ని ప్రచురణ సంస్థలు కూడ పనిచేస్తున్నాయి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒక పరిధిలో హిందీకి సంబంధించిన కార్య కలాపాలకు ఆర్థిక సహాయం కూడ చేస్తోంది ఇటీవల హిందీ అకాడమీని స్థాపించింది

ఇంత జరుగుతున్నప్పటికి బోధనారంగంలోను బోధనేతర రంగాల్లోనూ అనేక సమస్యలు తల ఎత్తుతున్నాయి ఆచరణలో కొంత అలసత్వం కారణంగాను కొంతమంది స్వార్ధపరుల కారణంగాను సమస్యల పరిష్కారం లోను వాంది ప్రచారం విషయంలో కూడ జాప్యం శైథిల్యం ఏర్పడటం జరుగుతోంది ప్రభుత్వంవారు వాందీ అభ్యున్నతికి అవరోధకరములయిన నిర్ణయాలను కొన్నిటిని తీసకోవడం కూడ జరిగినది

ఇట్టి స్థితిలో వాందికి సంబంధించిన మొత్తం సమస్యలపై ఆలోచన చేయడానికి సమస్యలను వింగడించి వాటి పరిష్కారానికై రాష్ట్రప్రభుత్వంతోను కేంద్రప్రభుత్వంతోను సంబంధం ఏర్పరచుకొని ఉత్సాహవర్ధకమైన అనుకూల వాతావరణం కల్పించుటకు గాను ఒక రాష్ట్రస్థాయి వేదికను నిర్మించవలసిన అవసరం ఏర్పడింది

ఈ కారణంగా రాష్ట్రరాజధాని హైదరాబాద్‌లో పెద్ద ఎత్తున ఆంధ్రప్రదేశ్ వాంది సమ్మేళనం జరుపుటకు నిశ్చయించి 5-12-1989 న జంట నగరాలకు చెందిన ప్రముఖులతో ఒక స్వాగత సమితి ఏర్పడింది దక్షిణ భారత వాందీ ప్రచారసభ స్నాతకోత్తర విభాగం రిజిస్ట్రారు శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారు అధ్యక్షులుగాను శ్రీ యుద్ధవీర్ మొదలయిన ప్రముఖులు ఉపాధ్యక్షులుగాను ఎన్నుకోబడినారు జంటనగరాలకు చెందిన ప్రముఖ వాందీ సంస్థల ప్రతినిధులు తదితర పెద్దలు స్వాగత సమితి కార్యనిర్వాహకవర్గ సభ్యులుగా ఉంటారు ఆంధ్రసభ ఆవరణలో స్వాగత సమితి కార్యాలయం ఏర్పాటయింది

ది 21-12-82 న జరిగిన కార్యనిర్వాహకవర్గ సమావేశంలో రు 1 25 000/- ల బడ్జట్టు ఈ సమ్మేళనమునకుగాను నిర్ణయించడమయినది ధన సంగ్రహ సమితి ప్రచార సమితి మొదలయిన సమితుల ఏర్పాటు జరిగింది మొత్తం ఆంధ్రప్రదేశ్ నుండి ఇంకా ఇతర ప్రాంతాల నుండి 2000 కు పైన ప్రచారకులు వాందీ అభ్యర్థులు సమ్మేళనంలో పాల్గొనగలరని భావిస్తున్నారు

ఈవిధంగా వాందికి సంబంధించిన సమస్యల పరిష్కారానికి పెద్ద ఎత్తున కృషి ప్రారంభం కావడం ముదావహం



# అనుభూతిలోంచి అనుభవంలోకి

—కస్తూరి వేణుగోపాల్

వేసవ వెన్ను తట్టటంతోనే
కళ్ళు కలువలై రెప్పల్ని విప్పార్చుకుంటాయి
దృశ్యాదృశ్య స్ఫురిత
ఉదయ ధరహాస విలాస విన్యాస లాస్య
హృదయాకాశంలో
అనంత భావానుభూత స్పందనల హరివిల్లు వెల్లివిరిసి.
మనస్సు ———
ఆమని కోయిలై అమృతగానం చేస్తుంది
కనురెప్పల వెనుకటి ప్రతి కదలికా - ప్రసవ వేదనై
రెటీనాపై వుదయించే రేపటి కలలు శిశురోదనై
ఆశల రెక్కల్ని తొడుక్కున్న జీవిత విహంగం —
ఆశయాకాశం కేసి దూసుకుపోతుంది
నిరాఘాటంగా
స్పష్టాస్పష్ట స్పందనలు హృదయాన్ని ఎండుతూ
నా గుండెల మీంచి నడిచెళ్ళిపోతున్నప్పుడు
అజ్ఞానాంధకార అగాధంలోకి జారిపడ్డ
జీవితం ——
దిక్కాసలవెంట దృక్కుల్ని సారిస్తుంది —
మనసు మూల్గుల్ని వినిరాగల
మరో చేతనత్వపు చేయూతకోసం
రాత్రంతా శరీర సరోవరంలో
మూగగా ముడుచుకున్న మనసు మొగ్గే' ——
ఉదయం కాగానే
ఊహలరేకల్ని విప్పుకొని —
ఊసులాడుకుంది వెల్తురు ఎట్టలతో

2

ఓటమి - గెలుపుల్లో ఒకే కొలతని గమనించలేనప్పుడు -
నూరేళ్ళ జీవితం విలువ = శూన్యం

చెదబెట్టిన పుట్టల్ని చించేయక పోతే
జీవితం పుస్తకం — చీకటి పురుగులకే ఆహారం
పారిపోతున్నకొద్దీ వెన్నాడి భయపెడుతుంది -
పిరికితనం = భయం = మృత్యుపాశం
ఆత్మని వంచించుకొని అంతరంగలోని
అనుభూతుల్ని శిలువేసుకునే కన్నా —
దీనత్వాన్ని దిగంతాల్లోకి విసిరి,
దీక్షతో జీవితాన్ని గెల్చుగల్గటం మిన్న
మరణించిన క్షణానికి పునర్జన్మ లేదు
మానవత్వం నశించిన —
మనిషిజన్మ కర్థం లేదు
ఎదుటివారి కన్నీళ్ళను తుడిచేందుకు చేసే —
ఎనలేని త్యాగానికి ఎన్నటికీ మరణం లేదు

వరకట్నపు విషగాలుల వడదెబ్బలు తింటూన్న
వధువుల కన్నీళ్ళను మధువుగా త్రాగి మత్తెక్కిన రక్కసుల్ని
కులమత విభేదాల కాలభుజంగాల కౌగిట్లో -
ప్రాణాల్ని కడతేర్చుకొంటున్న పామరుల్ని చూసి
నాలుగు దిక్కులూ నవ్విపోతున్నాయి
వాస్తవాల్ని దర్శించలేని కళ్ళు —
వ్యవస్థకు అభిముఖంగా ఎదిగిన ముళ్ళు
సహృదయ సుక్షేత్రాల్లో నాటుకున్న
సమభావనా విత్తు —
సజీవ స్పందనల నందనవనంలో మొలకలెత్తే —
సుందర సుమ సుగంధ
సురభిళ సౌరభాల్ని వెదజల్లే
వెన్నెల భవిష్యత్తు

1-1-17/1
హైద్రాబాద్—20

# పట్టణం పొలిమేరలు

—చల్లా రాధాకృష్ణ శర్మ

పట్టణం పొలిమేరలు దాటి
పయనించసాగి ది పొగబండి
నిసర్గ సౌందర్యం రూపుగట్టిన
పచ్చని పంట పొలాలమీదుగా
నేలమీద గిజగిజలాడిన చేప
నీటిలోకి వెళ్ళినట్లనిపించింది నాకు
రాహుగ్రస్తమైన భానుడు
బంధవిముక్తుడైనట్లు తోచింది నాకు
పట్టణం పొలిమేరల పొగబండి పయనిస్తుంటే
హరి గారి అనుకున్నాను కళ్ళు మూసుకున్నాను
ఎక్కడెక్కడి మురికినీరూ ఒక్కచోట చేరి
ముక్కలు బద్దలు చేస్తూ ప్రవహిస్తోంది
పట్టణంలోని మాలిన్యానికి ప్రతీకగా
తుప్పు పట్టిన రేకు కప్పులతో
నేల నంటిన గుడిసెలు కనిపించాయి
పట్టణంలోని తారతమ్యాలకు గుర్తుగా
మాసిన తలలతో దిస మొలలతో
నడుములు వంగిన మనుషులు కనిపించారు
పట్టణంలోని పేదరికానికి చిహ్నంగా
కరుడుగట్టిన చెత్తకుప్పలు
కళ్ళకి నరకంగా కనిపించాయి
పట్టణంలోని మోసానికి సంకేతంగా
కనుకనే
పచ్చని పొలాల మీదుగా పయనిస్తుంటే
పోయిన ప్రాణం లేచివచ్చినట్లనిపించింది
బాధామయ లోకంలోంచి బయటపడినట్లనిపించింది

13 ఏ సదాశివనగర్
వండియూర్
మధుర - 625020

# నేను ఛాందసుణ్ణి?

—డా॥ ముదిగొండ వీరేశలింగము

ఛాందసానికి నాది పుట్టిల్లు
ఛందస్సుకు నాది నట్టిల్లు
నా ముఖంలోనే ఛాందసం కొట్టవస్తుంది
ఛందస్సుపేరు చెబితే లోకం తిట్టవస్తుంది
నా ముఖాన్ని నేను అడుగుతున్నా -
నీ వెందుకింత ఛాందసం కలిగున్నావని
నీ కెందుకింత క్రౌర్యం లోకాన్ని చూస్తే అని -
సమాధానం వచ్చింది -
నాకేమీ క్రౌర్యం లేదే" —
లోకం నన్ను చూసి క్రూరుణ్ణనీ లోకకంటకుణ్ణనీ
గర్వాంధుణ్ణనీ, గతమంటే మమతనీ
నన్నే తిట్టిపోస్తుంది అవసరమైతే కొట్టవస్తుంది
వారి దృష్టిలో నేను చరిత్రహీనుణ్ణి
చరిత్ర వారి కవసరం లేదట
చరితార్థులు అస లుండకూడదట
చర్విత చర్వణ మసలే కూడదట
చరిత్రలేని మానవుడికి చరిత్రంటే అర్థమయ్యేనా
చరిత్రలేని మానవుడంటూ అసలుండేనా?
ప్రతిక్షణం మరోక్షణంలో చరిత్ర కాదా!
ప్రతి నిమిషానికి మానవుడు వృద్ధుడు కావడం లేదా!
ఈ నిత్యసత్యాలు మానవ జగత్తు
గ్రహించేదెప్పుడు? స్మరించేదెప్పుడు?
అర్థం కానంతవరకు నేను
లోకానికి క్రూరుణ్ణి,
అంతవరకూ ఛాందసుణ్ణి

తెలుగుశాఖ
ప్రభుత్వ కళాశాల
కరీంనగరము 505002

# సాంఘిక ఏకాంకికల్లోని సామాజిక స్పృహ

—తలపాటి సుబ్బారావు

సాహిత్య ప్రక్రియల్లోకల్లా నాటకానికి ఒక విశిష్ట స్థానం లభించింది అందుకే కావ్యేషు నాటకం రమ్యమ్ అని ఒకరంటే నాటకాన్తమ్ హి సాహిత్యం అని మరొకరన్నారు సకల సాహిత్య ప్రక్రియలు పరిపక్వదశకు వచ్చిన తరువాతనే నాటకం వెలుగులోకి వచ్చింది ఆధునిక తెలుగు సాహిత్యంలో నవల ఖండకావ్యం కథానికాదులు ఏవిధంగా నూతనంగా వికసించిన ప్రక్రియలో అదే విధంగా ఏకాంకిక కూడా నూతనంగా వికసించిన ప్రక్రియ ఏకాంకిక ఆవిర్భావానికి ఆంగ్లం లోని One act play (ఏకాంకిక) చాలావరకు దోహదం చేసింది ఏకాంకిక వేగంగా వ్యాప్తి చెందటానికి గల కారణం ఆధునిక మానవుడు సూక్ష్మంలో మోక్షం పొందటానికి తన కళాజీవితాన్ని సంక్షిప్తత చేసుకోవడమే ఆవిధంగా ఏర్పడినవే పై నూతన ప్రక్రియలు నాటి మానవునికి నాటకం ఇచ్చినంత ఆనందాన్ని నేటి మానవునికి ఏకాంకిక ఇంచుమించుగా ఇస్తుందని చెప్పవచ్చు ఏకాంకిక పండితులకూ పామరులకూ తక్కువ సమయంలో ఎక్కువ ఆలోచనల్ని రేకెత్తిస్తుంది సాంఘిక ఏకాంకికల్లో సామాజిక స్పృహ ఏ విధంగా ప్రతిబింబిస్తుందో తెలియజేయడమే వ్యాసోద్దేశం

మనకు నాటకాల వలె ఏకాంకికలు నాటికలు చాలా ప్రాచీన కాలం నుంచీ పరిచితమైనవే భరతుడు పేర్కొన్న దశరూపకాల్లోని భాణం వీథి, అంకం వ్యాయోగం ప్రహసనం ఉపరూపకాల్లోని 14 రూపకాలు (1 రాసకము 2 నాట్యరాసకము 3 భాణము 4 డోంబి (డొంబిక) 5 భాణిక 6 ప్రస్థానకము (ప్రస్థానము), 7 ప్రేక్షణకము (పేంఖణము) 8 హల్లికము 9 కావ్యము 10 పారిజాతకము (పారిజాతలత) 11 గోష్ఠి 12 శ్రీగదితము 13 విలాసిక 14 ఉల్లోప్యకము) ఏకాంకికలే కానీ వీటికినీ నేటి ఏకాంకికకును ఎట్టి సామ్యమూ లేదు ఆంగ్ల ఏకాంకికలు కూడా ఇటీవల కాలంలో ఆవిర్భవించినవే మొట్టమొదట ఇవి మిస్టరీ మిరికల్ రూపాల్లో ఉండేవి

సంస్కృత నాటకాల్లోనూ నాటికల్లోనూ అంక విభజన ఉంది ఈ అంకానికి ఏకాంకికల్లోని అంకానికి భేదం చూపించడానికి ఉత్సృష్టికాంకం అని ఏకాంకికల్లోని అంకాన్ని పేర్కొన్నారు సంస్కృత నాటక, నాటికల్లోని అంక లక్షణాలు, అరిస్టాటిల్ ఐక్యత్రయాల లక్షణాలు ఇంచుమించుగా నేటి ఏకాంకికకు సంపోతాయి మన ప్రాచ్యులు అంకాన్ని రంగాలుగా విభజించరు పాశ్చాత్యులు అంకాన్ని రంగాలుగా విభజిస్తారు నేడు రంగవిభజనలేని ఏకాంకికలు విభజన చేసిన ఏకాంకికలు వస్తున్నాయి నేడు ఏకాంకికల్ని కూడా నాటికలనే వ్యవహరిస్తున్నారు ఆంగ్లం లోని One act-play లో రంగాలు ఏ విధంగా ఉన్నాయో అదే విధంగా నేటి ఏకాంకికల్లోనూ రంగ విభజన ఉండవచ్చు రంగాల ప్రసక్తి లేకుండా ఒకే అంకం కలిగిన వాటిని ఏకాంకిక లనడం శాస్త్రీయం కాని లోకంలో రంగవిభజన గలిగిన ఏకాంకికలనూ రంగ విభజన లేని ఏకాంకికలనూ కూడా నాటికలు అనడం పరిపాటి అయింది

నాటకాన్ని గాని నాటికను గాని సంక్షిప్తం చేసిన ఏకాంకిక అవుతుందని భ్రమపడరాదు దేని రచనా శిల్పం దానిదే దేని కదే ఒక ప్రత్యేక కళ ఈ మూడింటికీ ప్రదర్శన కాలంలోనూ వస్తువును స్వీకరించడంలోనూ పరిమాణంలోనూ పాత్రలసంఖ్య లోనూ భేదాలున్నాయి ఏకాంకికకు ఒకే రోజులో జరిగిన రెండు మూడు సంఘటనలూ ఒకే నాయకుడికి జరిగిన కథా తక్కువ పాత్రలూ చిన్న చిన్న సంభాషణలూ, సంభాషణలో ఉత్కంఠా కౌతుకాలూ ఉండి తీరాలి ప్రయోగం 30 నిమిషాల నుంచీ 45 నిమిషాల్లో పూర్తి అయ్యే ఉద్దేశంతో అన్నింట సంక్షిప్తత అవసరం నాటకం పరిమాణం పెద్దదగుట వల్ల కథలో ఉపకథలూ ఎక్కువ పాత్రలూ పెద్ద పెద్ద సంభాషణలూ ఉండడంవల్ల ప్రయోగకాలం సుమారు మూడు గంటలు నాటిక ప్రయోగం సుమారు ఒక గంట వ్యవధిలో సమాప్తం కావాలి పాత్రల విషయం లోనూ కథ విషయంలోనూ రచన విషయంలోనూ కొంచెం ఏకాంకిక కంటే ఎక్కువగా ఉంటుంది ఏకాంకికలో వస్త్వైక్యం కాలైక్యం విధిగా పాటించాలి స్థలైక్యాన్ని మాత్రం విధిగా పాటించనవసరం లేదు నాటికలో కూడా ఐక్యత్రయాన్ని పాటించడం లోనూ పాత్రల విషయంలోనూ ఒకే విధంగా ఉండడం వల్ల ఏకాంకిక నాటికలకు భేదాల్ని పాటించడం లేదు

ఏకాంకికను గూర్చి పండితాభిప్రాయాల్ని తెలుసుకుందాం జె డబ్ల్యు మారియెట్ ఒక సన్నివేశాన్ని ఎంత తక్కువ సాధన సంపత్తిలో ఎంత బాగా రక్తి కట్టించడానికి వీలున్నదీ సక్రమంగా రచించి ప్రదర్శించిన ఏకాంకిక నాటికి ఋజువు చేస్తుంది అని నిర్వచించారు

బ్రాండరు మాథ్యూసు In dramatic composition the equivalent of the short-story is one-act-play' అంటే ఏకాంకికా నిర్మాణం కథానికా నిర్మాణంవలె ఉంటుందని భావం కథానికలోని కథను నాటకీయం చేయడమే ప్రధాన ధర్మం ఎ యస్ ఆర్ అప్పారావు గారు కూడా ఏకాంకికా నిర్మాణం కథానికా నిర్మాణం వలె ఉంటుందని తెలుగు నాటక వికాసంలో సూచించారు

ఇక సామాజిక స్పృహను గూర్చి తెలుసుకుందాం సమాజాన్ని చిత్రించడం ద్వారా కూడా సామాజిక స్పృహను చెప్పవచ్చు సమాజాన్ని అనుకూలంగా చిత్రిస్తే ఇటువంటి సమాజం కావాలనీ ప్రతికూలంగా చిత్రిస్తే ఇటువంటి సమాజం వద్దని చెప్పడమే కదా! అందుచే సమాజ చిత్రణలోనూ సామాజిక స్పృహ ఉంటుందని చెప్పాలి ఈసామాజిక చిత్రణ స్పృహ మన ప్రాచీన నాటకాల్లోనూ కావ్యాల్లోనూ ఉంది

భరతముని నాట్యశాస్త్రంలో లోకోపదేశ జననం అని నాటక ప్రయోజనాన్ని పేర్కొన్నారు ఆధునికులు దీన్ని సందేశం సామాజిక చైతన్యం సామాజిక చిత్రణ, సామాజిక స్పృహ అని వ్యవహరిస్తున్నారు ప్రాచీన సాహిత్యంలో సందేశాన్ని కాంతా సమ్మితంగా పురాణ పురుషులూ పశుపక్ష్యాదుల కథలతో జోడించి వివరించారు బహుశ ఆనాటి సమాజానికి ఆ విధమైన సాహిత్యమే అవసరమై ఉంటుంది కాని నేడు సమాజంలో అవినీతి సంఘ దురాచారాలు ఆర్థిక అసమానతలు నిరుద్యోగ సమస్య లంచగొండితనం మొదలైనవి పెరిగిపోతూనే ఉన్నాయి వాటిని అరికట్టే మార్గాలు గల ఇతివృత్తాలే నేటి కవులకు శరణ్యమయ్యాయి వీరేశలింగాది సంఘ సంస్కర్తలు కూడా తమ నాటకాల్లోనూ ప్రహసనాల్లోనూ ఇటువంటి ఇతివృత్తాలనే గ్రహించి సంఘాన్ని మేల్కొలిపారు

వాస్తవానికి తెలుగు ఏకాంకికా రచన ఆరంభమయ్యేసరికి తెలుగు సాహిత్యంలో ఈ నవ చైతన్యం ఆంగ్లసాహిత్య ప్రభావం వల్లనే కలిగినదనడంలో

సందేహం లేదు నాటకం నాటకి ఏకాంకిక దేనిందే ఒక ప్రత్యేక క అని ఇంతెర మ దు చెప్పబడింది "కళ కళకోసం కాదు ప్రజల కోసం అన్న విష యాన్ని గుర్తించు కోవడం ఎంతైనా అవసరం ఇట్టి సందర్భంలో ఆర్ ఎస్ సుదర్శనంగారిమాటల్ని గమనించాలి సాహిత్యం యొక్క సముచిత కర్త వ్యం సామాజిక చైతన్యస్వరూపాన్ని ఎప్పటి కప్పుడు స్వచ్ఛందంగా ప్రతిబింబిస్తు ఉండడమే అని సాహిత్యం యొక్క పరమార్థాన్ని తెలుగు సాహి త్యంలో సామాజిక చైతన్య' మను వ్యాసంలో పేర్కొన్నారు సమాజంలో అన్యాయం జరగడానికి వీఌలేదని చెప్పడమె సామాజిక స్పృహ సమాజంలో ఉన్నది ఉన్నట్లు చిత్రిస్తే దాన్ని సామాజిక చిత్రణ అనవచ్చు ఈరెంటి ద్వారా సామాజిక స్పృహను వివ రించ వచ్చు నన్న విషయం ఇంతకు ముందు వివ రించబడింది

నేటి కవులు కొన్ని నాటికల్లో సమాజ చిత్రణనో సమాజ సమస్యనో సమస్యతో పాటు దానికి పరి ష్కార మార్గాన్నో సూచిస్తున్నారు సమస్యకు పరి ష్కారాన్ని ఇచ్చితీరాలన్న అపోహ చాల మందిలో ఉంది నాటక రచయిత పని ప్రశ్నలు అడిగే వరకే గాని సమాధానం ఇవ్వడం ఇవ్వకపోవడం నిర్ణయించు కొనే హక్కు ఉందని ఇబ్సన్ పండితుడు ఈవిధంగా సూచించారు A dramatists burines is not answer questions are merely to ask them కొందరు కవులు తమ నాటికల్లో ఆవేశవంతమైన సంఘటనల్ని సృష్టించి ఆయాస వంతులనే చేస్తున్నారు దీని వల్ల అంత ప్రయోజనం లేదేమో ననిపిస్తుంది

ఇక సాంఘిక ఏకాంకికల్లో సామాజిక స్పృహ ఏ విధంగా ప్రతిబింబిస్తుందో పరిశీలిద్దాం సంఘదురాచా రాలు కులమత వర్గ వ్యవస్థల మధ్య జరిగే సంఘర్ష ణలూ నిరుద్యోగ ఆహార సమస్యలూ మొదలైన సమ స్యల్ని దృష్టిలో పెట్టుకొని ఇతివృత్తాలుగాగల ఏకాంకి కల్ని సాంఘిక నాటికలుగా పేర్కొనవచ్చు

మూఢనమ్మకాలు పేరిట స్త్రీలకు జరిగే అన్యా యాల్ని స్త్రీలకు సంబంధించిన సమస్యల్ని ఇతివృత్తా లుగా గ్రహించి ఏకాంకికల్ని వ్రాసిన వారిలో రాజ మన్నారు, ఎనిసెట్టి చలం మొదలైనవారి ఏకాంకి కల్ని మొదట పేర్కొనవచ్చు

రాజమన్నారు ఏమి మగవాళ్ళు ! ఏకాంకికలో నాయకుడు ఛాందస బ్రాహ్మణ కుటుంబానికి చెందిన వేశ్యన ఆదర్శ వివాహం చెసుకుంటాడు నాయికను ఇంటికి తీసుకుని వస్తాడు ఆమె వేశ్య అయినందు వల్ల ఒంటరిగా ఉన్న సమయంలో చిన్న పెద్ద మామలు ఈమెతో సరసాలాడడానికి ప్రయత్నిస్తారు దీనికి కారణం ఈమె చనవేనని నాయకుడు అను మానిస్తాడు చివరకు ఆ ఇంటిలోవి అవకతవకల్ని ఎత్తిచూపు "ఏమి మగవాళ్ళు !" అని మాంగల్యాన్ని త్రెంపి వీధి వె బడి పోతుంది "లోలోపల ఉన్న కోరికల్ని అణచుకొని సంఘ మర్యాదల కోసం నాటక మాడే పెద్ద మనుష్యులకు ఒంటరిగా వేశ్యగాని అంద మైన స్త్రీగాని కనబడగానే అవకాశం దొరికింది కదా అని కక్కుర్తిపడేవారికి ఈ నాటిక చక్కని చురక ఆవేశంలో ఆలోచన నశిస్తుందని ఇందలి నాయికా నాయకులకు చక్కని సందేశం

వీరి దయ్యాల లంక నాటికలో సుధ అనే అమ్మాయికి బాల్యంలోనే వివాహం వైధవ్యం సంభ విస్తాయి సంఘం విధించిన నియమాల్ని ఈమెకు తెలియకుండా తండ్రి జాగ్రత్తపడ్డాడు ఆమె అక్క సుధ అందాన్ని భరించలేక తన భర్త ఈమెపై చూపు మరల్చుతున్నాడనే ఉద్దేశ్యంతో ఈమెకు సంఘం విధించిన విధవ నియమాల్ని వివరిస్తుంది చివరకు సంఘం కత్తులబోనని తనలాంటి వారిని బ్రతకనీయ దనీ సుధప్రాణాల్ని కోల్పోతుంది దీనితో బాల్య వివాహం సంఘ దురాచారాల వల్ల బాలిక ఏ విధంగా బలి అయ్యిందీ రచయిత మన కళ్ళకు కట్టినట్లు చిత్రించారు

రాజమన్నారు గారి పాషాణం నాటకలో రంగారావు అనే జమీందారు చిత్రరేఖ అనే వేశ్యతో అక్రమ సంబంధం పెంచుకొని తన ఆస్తం దుబారాగా ఖర్చుచేసి చివరకు అప్పులకు గురి అవుతాడు రంగారావు మీద ప్రేమకొద్ది వేశ్యే అప్పుల్ని తీరుస్తూ ఉంటుంది భార్య ఉపదేశం వల్ల రంగారావు వేశ్యను విడిచి భార్యకూడా వెళ్ళిపోతాడు వేశ్యల్లోనూ హృదయమున్నవారు ఉన్నారనీ వారూ ప్రేమించ గలరనీ వారూ మనుష్యులేననీ వారికీ అభిమాన మున్నదనే నగ్నసత్యాన్ని నిరూపించినా చివరకు ప్రేమాభిమానాలు రెండు వారికి నిష్ఫలాలే అనే సందేశాన్ని ఈ నాటిక చెబుతుంది అదే విధంగా వీరి తప్పెవరిది ! మాతృప్రేమ సంకల్పం- పర్యవసానం మొదలైన నాటికల్లో చక్కని సందేశాలిచ్చారు

చలంగారు పంకజం లో భార్యాభర్తలమధ్య అనుబంధం కన్నా తల్లికీ పిల్లకీ మధ్యగల ప్రేమ అతీతమనీ పిల్లలకోసం తల్లి ఎంతటి త్యాగమైనా చేస్తుందనీ ఈనాటికలో వ్యక్తం చేశారు పంకజానికి మధుసూదనరావుకి వివాహంజరిగిన మొదటిరాత్రే మధుసూదనరావు కళ్ళముందే ఈమె శీలాన్ని దొంగ బలవంతంగా దోచుకుంటడు ఈకారణంవల్ల మధుసూదనరావు ఈమెను తిరస్కరించి నీకూ నాకూ సంబంధం లేదని వెళ్ళిపోతాడు సంవత్సరం తరవాత పంకజాన్ని తనతో తన ఇంటికి రమ్మంటాడు కాని బిడ్డను తిరస్కరిస్తాడు బిడ్డలేనిదే నేను రానంటుంది పంకజానికి జరిగిందిఅన్యాయమని తెలిసికూడా మధుసూదనరావు పంకజం తల్లి ఈమెను ఇంటి నుంచి బహిష్కరిస్తారు భార్య శీలాన్ని కాపాడ లేని మధుసూదనరావు వంటి వారికి పందలకు ఈ నాటిక కొరడా వంటిదని చెప్పవచ్చు

కాశీ విశ్వనాథం జారుడు మెట్లు లో సామాజిక చిత్రణ సామాజిక స్పృహ ప్రతిబింబిస్తున్నాయి ఇందులో నాయికా నాయకులు తమ నిర్ణయాల్ని తల్లిదండ్రులు అంగీకరించరేమోనని లేచిపోవడానికి సిద్ధంగా ఉన్న ఒక అమ్మాయి గాధను చిత్రించారు దీనికి పరిష్కార మార్గంగా రాఘవరావు పాత్రచే లేచిపోయిన యువతి విషాద గాథతో లేచిపోవడానికి సిద్ధంగా ఉన్న యువతికి చక్కని ప్రబోధం చేశారు

ఎనిసెట్టి ఆడది నాటికలో ఆడదిలేని సంసారం చివరకు ఛిన్నా భిన్నంగా మారుతుంది అని మగవారికిచ్చే సందేశం

నార్ల ప్రారబ్ధం"లో ఆధునిక విజ్ఞానంలో ఉన్న ప్రయోజనాల్ని అవగాహన చేసుకోలేక మూఢ నమ్మకాల్లో మునిగి పాత విధానాలే అనుసరించి కర్మ అని ప్రారబ్ధం అనీ విశ్వసించడం వల్ల కలిగే ప్రమాదాల్ని ఈ నాటికలో స్పష్టం చేశారు మూఢనమ్మకాలనే నమ్మిన లక్ష్మయ్య తనకూతురికి తక్కువ కట్నమనీ అల్లర చిల్లరగా తిరిగి గుణహీనుడైన తన మేనల్లునితో వివాహం చేస్తాడు కట్నం తీసుకొని రాలేదని అత్త మామల రంపపు కోతకు భర్త పెట్టిన హింసలకు లక్ష్మయ్య చేయించే నాటు వైద్యాలకు బలియై మరణిస్తుంది దీనిలో కృష్ణమూర్తి పాత్రద్వారా ఆధునిక వైద్యాల అవశ్యకతను లక్ష్మయ్య వంటి వారికి కవి ఉపదేశించారు పై నాటికల్లో సామాజిక స్పృహ గర్భితంగా ఉందని చెప్పవచ్చు ఎక్కువగా సామాజిక చిత్రణ ఉందని చెప్పవచ్చు

కొన్నిసాంఘిక ఏకాంకికల్లో సామాజికస్పృహ కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది దీన్ని నేడు విప్లవాత్మక రచనలనీ వ్యవహరిస్తున్నాం దీనికి కారణం మరుతున్న వ్యవస్థ ముఖ్యంగా శ్రమజీవులకు పెట్టుబడి దార్లకు మధ్య పొత్తు కుదరక పోవడమే

గణేష్‌పాత్రో ఆగండి కొంచెం ఆలోచించండి లో పల్లెటూరి వాతావరణంలో చక్కని ఏకాంకికల్ని వ్రాశారు ఇందు ఆదెయ్య తననూ తన కొడుకుల్ని

వాంఛిస్తున్న ధనవంతుడైన సత్తెయ్యపై తిరుగుబాటు చేయలేక కొడవలితో పొట్టకోసుకుని మరణిస్తాడు ఆదెయ్య చిన్నకొడుకైన చిన్నడు సత్తెయ్య అన్యాయాల్ని ఎదుర్కొని సత్తెయ్యను కొట్టినందుకు పోలీసులు ఆరెస్టుచేసి స్టేషనుకు తీసుకుని వెళ్లే సందర్భంలో ఈడ్ని ఎవలూ సంపనేదే! ఇదిగో సూడండి ఈడి సావుమూలంగా ఎవడికీ నచ్చపడదు ఎవరూ ఉ కంబానికెక్కరు ఎవడ్ని పోలీసులు ఎంటదరుమరు ఈడికి ఒల్లు కొవ్వెక్కి తిన్నదరక్క మదంనావై పోయి కొడవల్తో పేగులు కోసుకొని సచ్చిపోనాడు సూడండి! అందరూ సూడండి సూడండి కాస్త ఆలోచించి సూడండి అంటూ ఉండే తెరజారుతుంది దీని పరిష్కారాన్ని ప్రేక్షకులు మరిచిపోతారేమోనని లేచిపోవడానికి సిద్ధంగా ఉన్న ప్రేక్షకులతో "ఆగండి! కొంచెం ఆలోచించండి!! ఆగండి! కొంచెం ఆలోచించండి!! ఆగండి! కొంచెం ఆలోచించండి!!! అంటూ ఉన్నారు ఈ రచయిత అనగా ఆదెయ్య లాంటివారు అన్యాయాల్ని ఎదిరించడానికి కొడవళ్ళు కత్తులూ నూరి సిద్ధం చేసుకోవాలనీ, ఉరి పోసుకుని చావడం కంటే తిరగబడి చావడం మేలని ప్రజలు ఎంత త్వరగా గ్రహిస్తే అంత మంచిదనే ఉద్దేశంతో ఆగండి! కొంచెం ఆలోచించి మరీ వెళ్ళండి! అని ప్రేక్షకుల్ని హెచ్చరిస్తున్నారు

ఆహార సమస్య నిరుద్యోగ సమస్యలతో అనేక నాటికలు వచ్చాయి అట్టివాటిలో ఎవరు దొంగ?" వెంకన్న కాపురం' పట్టభద్రుల ఫలాహారశాల'' మనుష్యులొస్తున్నారు జాగ్రత్త మొదలైన నాటికల్ని పేర్కొనవచ్చు

ఆత్రేయగారి "ఎవరు దొంగ లో పెట్టుబడిదార్లు చేసే అక్రమ వ్యాపారాలైన బియ్యంలో రాళ్ళు కలిపి వాటిని ప్రభుత్వ సంస్థలకే సరఫరాచేసి ప్రభుత్వం నుంచి అధిక ధనాన్ని దోచుకునే విధానాన్నీ రైతులకు పండిన పంట నంతటిని జమీందార్లు దౌర్జన్యంగా దోచుకునే విధానాన్న ఈ నాటికలో చిత్రించారు ప్రోత్సహిస్తున్న ప్రభుత్వోగుల్ని ఎదుర్కొన్న పోలీసు అధికారికి జరిగిన అన్యాయాన్ని కూడా కవి చిత్రించారు సమాజంలో ఇన్ని రకాల దొంగలుండగా భార్యాబిడ్డలప్రాణాల్ని రక్షించడానికి కొంచెం బియ్యం దొంగిలించాడని ఒక సామాన్యుణ్ని దొంగగా గుర్తించిందీ ప్రభుత్వం అని ఈ నాటిక ద్వారా రచయిత చెబుతున్నారు దీని పరిష్కార మార్గాన్ని పోలీసు అధికారి పాత్రచే "మునసబుగారూ నా చేతనైనది చేద్దామనుకున్నాను అవినీతిని అరికట్టాలనుకున్నాను ఇక మీరు గ్రామాల్లో ప్రజలు పరిష్కరించుకోవాలి ఈ తిండి సమస్యను అని ప్రజలకే పరిష్కార మార్గాన్ని విడిచిపెట్టారు

ముదికొండ లింగమూర్తి వెంకన్న కాపురం లో నిరుద్యోగ సమస్య ఆర్థిక అసమానతలు మధ్య తరగతికి చెందిన వెంకన్న కాపురంలో ప్రతిబింబిస్తున్నాయి వెంకన్న తన చాలీచాలని జీతంతో తన కొడుకుల్ని బి ఏ లు ఎమ్ ఏ లు చదివిస్తాడు తనలో శక్తి నశించేటప్పటికి నిరుద్యోగ కొడుకులూ కట్నం ఇవ్వలేదని అల్లుడు పెట్టె బాధలూ రోగంతో పీడితురాలైన భార్యా అప్పులూ మిగిలాయి ఇది సమాజంలో నేటికినీ మధ్యతరగతి కుటుంబాల్లోనే గాక అగ్రజాతి కుటుంబాల్లోనూ జరుగుతున్న వాస్తవిక కథే

గోపాలకృష్ణ "పట్టభద్రుల ఫలాహారశాల" నాటిక కూడా ఈ కోవకు సంబంధించినదే. పట్టభద్రులకు ఉద్యోగాలు లభించనందువల్ల చివరకు ఒక ఫలాహారశాలాధికారి నుంచి లంచం తీసుకున్న ఆరోగ్యశాఖోద్యోగి పట్టభద్రుడు ఫలాహారశాలలో ఫలాహారం శుభ్రంగా లేదనీ నిర్మించిన స్థలం ప్రభుత్వానిదనీ పోలీసు స్టేషనుకు తీసుకొని పోతాడు. దీని పరిష్కార మార్గాన్ని కూడా ప్రజలకే విడిచి పెట్టారు.

ఈవిధంగా సాంఘిక ఏకాంకికల్లో సామాజిక చిత్రణ సామాజిక స్పృహ ఎలా ప్రతిబింబిస్తుందో స్థాలీపులాకంగా తెలుసుకున్నాం. విశ్వనాథ కవిరాజు గారి దిద్దుబాటు 'రాజీవం' నెపథ్యం మొదలైన నాటికల్లోనూ భమిడిపాటి కామేశ్వరరావు రాధాకృష్ణ చిలుకూరి నారాయణరావు జి.వి. కృష్ణరావు కొర్రపాటి గంగాధరరావు ముక్కపాటి మొదలైన రచయితలు నిర్మించిన నాటికల్లోనూ సామాజిక చిత్రణ స్పృహలు ప్రతిబింబిస్తున్నాయి.

ఇంకా ఉత్తమతరమైన ఏకాంకికల్ని వ్రాసి సమాజానికి కనువిప్పు కలుగజేస్తారని రచయితల్ని వారి అభిప్రాయాల్ని ఆదరించి పాటిస్తారని ప్రేక్షకుల్ని పాఠకుల్ని ఆశిద్దాం.

తెలుగు పరిశోధకులు
ఆంధ్ర విశ్వకళాపరిషత్తు
వాల్తేరు-530003

# 'హంస ఎగిరిపోయింది' కుందుర్తి చరమ కావ్యం!

—సోమసుందర్

ఏ కళాకారుడి జీవితంలోనైనా ఆయుర్దాయం ముగియకుండానే కళాకాంతులు మాసిపోవడం కన్న వేరే మృత్యువుండదు చివరి ఊపిరి వదిలే వరకూ కవితారచనావ్యాసంగులు కావడం కొద్దిమంది ప్రజ్ఞా పారంగతులైన కవుల అదృష్టం! అట్టి అదృష్టశాలురలో శ్రీకుందుర్తి ఆంజనేయులు నిస్సందేహంగా ఒకరు

1922 డిసెంబరు 16న గుంటూరు జిల్లా నరసరావుపేట తాలుకాలో ఒక కుగ్రామంలో తండ్రి దివంగతుడైన రెండు వారాలకు ఆగర్భ దుఃఖంతో జన్మించిన కుందుర్తి ఇరవయ్యేళ్ళ లేబ్రాయానికే ఆధునిక కవిశ్రేణిలో ప్రముఖస్థానం అందుకున్నాడు అనిశెట్టి సుబ్బారావు ప్రభావంలో అతని మార్గదర్శకత్వంలో నరసరావుపేటలో నెలకొల్పబడిన నవ్య కళా పరిషత్‌లో ప్రముఖసభ్యులలో ఒకడయ్యాడు

1942లో జరగవలసిన అనిసెట్టి వివాహం ముహూర్త నిర్ణయాదులన్నీ పూర్తిఅయిన తరువాత పెళ్ళిరోజునే మద్రాసు ప్రభుత్వం వారిచే రెండున్నర సంవత్సరాల జెయిలు జీవిత శిక్షకు ప పబడ్డాడు మద్రాసు కాలేజి విద్యార్థిగా విప్లవ కమ్యూనిస్టులతో (టెర్రరిస్టులు) సంబంధం పెట్టుకొని, వారి ఆంగ్లకరపత్రాలను తెలుగులో అందచేస్తున్నాడన్నది అతనిపై మోపబడిన నేరం! జెయిలుశిక్ష అనుభవించి విజయవంతంగా తిరిగి వచ్చి 1945 ప్రారంభంలో అనిసెట్టి వివాహితుడవుతున్న సందర్భంలో నవ్యకళా పరిషత్‌కు చెందిన కవులు ముగ్గురు కుందుర్తి ఏల్చూరి సుబ్రహ్మణ్యం బెల్లంకొండ రామదాసు గార్లు తమ కవితలను సంకలించి నయాగరా అనే చిన్న కవితా సంపుటిని ప్రచురించి అనిసెట్టి దంపతులకు అంకితమిచ్చారు

నిజానికి ఆధునిక విప్లవాత్మక కవితా సంపుటాలలో ప్రప్రథమంగా ప్రచురితమైనది నయాగరాయే! 1938లో శిష్ట్లా ఉమామహేశ ఎరాపురం యువరాజా (రావు వేంకట గంగాధరరామారావు) పరాభి గార్లు తమ ఆధునిక కవితా సంపుటాలు ప్రచురించక పోలేదు కాని అవి రీతిగతంగా ఆధునికమైనవే తప్ప వస్తువురీత్యా విప్లవాత్మకమైనవి కావు

నయాగరా సర్వాత్మనా ఆధునిక విప్లవాత్మక కావ్యంగా ఆవిర్భవించింది అంతర్జాతీయంగా ప్రఖ్యాతుడైన జర్మన్ కవి ఎర్నెస్ట్‌టోలర్ సూక్తిని మకుటంగా ధరించి VERSELIBERE అనే ఫ్రెంచి సంవిధాన పర్యాయ పదాన్ని ప్రయోగించుకుంది పెళ్ళికొడుకుగా ఖైదుకు వెళ్ళి జెయిలునుంచి వచ్చి పెళ్ళికొడుకయిన శ్రీ అనిశెట్టి అనే విప్లవకవి సోదరునకు అంకితమీయడం కోసం ఆవిర్భవించింది ఆ విధంగా నయాగరా జననం సర్వాంగీణంగా విప్లవాత్మక సంఘటనగా రూపొందింది

ఆ సంపుటిలోని శ్రీ ఏల్చూరి బెల్లంకొండలు ప్రతిభావంతులే! కాని జీవన సమరంలో కవితా రచనను దాదాపు విడిచిపెట్టినవారు బెల్లంకొండ రామదాసు ముందునాళ్ళ విప్లవ పథాన్ని విడిచి వ్యక్తివాదాల గుడిసుళ్ళలోపడి నలభయ్యోపడిలోనే కాలధర్మం చెందిన దురదృష్టశాలి! ఈ త్రిమూర్తులలో ఒక్క కుందుర్తే ఆమరణం కవిత్వంతో బ్రతికాడు కవిత్వం కోసమే బ్రతికాడు ఆధునిక కవితా రీతికి ఉద్యమ కర్తగా బహుళాంధ్ర ప్రశస్తి తెచ్చాడు ఆధునిక ముక్తచ్ఛంద కవిత్వం అతని కెంత బాసటగా నిలచిందో అంత బాధ్యతాయుతంగానూ దాని పురోగతికీ తానంతే బాసటగా నిలచినవాడు ఫ్రీవెర్సు ఫ్రంటు నెలకొల్పి తద్వారా యువజనులలో కవితా

దీపాన్ని వెలిగించాడు ఆది కిందిగట్టకుండా కాపలా నిలచి చరిత్రను సృష్టించాడు అసంఖ్యాక పురస్కారా లందుకొన్నాడు

1982 డిసెంబరు 16న మిత్రులంతా కలసి పెద్ద ఎత్తున కుందుర్తికి షష్టిపూర్తి ఉత్సవం జరపాలని ప్రయత్నాలు చేస్తున్నారు కాని ఆ ప్రయత్నాలకు సఫలత చేకూరనివ్వకుండా అక్టోబరు 25వ తేదీ ఉదయం నగరంలో అస్తమించిన వచన కవితా సూర్యుడు కుందుర్తి!

## కావ్యత్వ మందిన పత్నీవియోగం

1981 డిసెంబరులో శ్రీ కుందుర్తికి పత్నీవియోగం సంభవించింది రెండు మూడునెలలు తీవ్ర రుగ్మతకు పాల్పడి అతని భార్య కాలధర్మం చెందింది ఆ తీవ్ర వేదనతో శ్రీ కుందుర్తి ఈ సంవత్సరపు మొదటి రెండు నెలలలో హంస ఎగిరిపోయింది అని స్మృతి కావ్యం రచించాడు దానికి సైక్లోస్టయిల్ ప్రతులు తీయించి బంధువులకూ మిత్రులకూ పంపించాడు ఆ విధంగా ప్రతులందుకొన్న భాగ్యశాలురలో ఈ వ్యాసకర్త ఒకడు పైగా ఏప్రిల్ మే నెలలో ఎందుకో రెండు ప్రతులు పంపాడు ఆసాంతం చదివి చేయవలసిన మార్పులను క్షుణంగా సూచిస్తూ తొలిప్రతి మళ్ళీ కుందుర్తికే పంపాను నా వ్యాఖ్యల నతడు ఆత్మీయంగా ఆదరించేవాడు కూడ

ఎరిగినంతవరకూ ఆధునిక కావ్యశ్రేణిలో ఒక సంపూర్ణ స్మృతి కావ్యం ఈ హంస ఎగిరిపోయింది ఒక్కటే! లఘు కావ్యాలెందరో రచించి ఉండవచ్చు అది వేరు ఆదర్దా భయం వగైరా పన్నెండు పదాలను పన్నెండు సర్గలకూ శీర్షికలుగా అమర్చాడు. ఈ దీర్ఘ కావ్యం ప్రతిపద ప్రతిపాద రసోదంచితంగా అమరింది పత్నీవియోగంవల్ల సంభవించిన క్లైశాలు-కరుణ రసాత్మక స్థాయి నందుకున్నాయి పఠితను లేదా శ్రోతను రసభారనిమగ్నుడ్ని చేస్తుంది కావ్యగత చింతామగ్నతలో సహృదయులు పూరాభిషేచన మందుకుంటారు

కుందుర్తి వ్యక్తిగతంగా ఏకపత్నీ వ్రతుడు దుర్వ్యసన విదూరుడు ఆధునిక కవులలో పావిత్ర్యాన్ని వెదికితే ఒక్క కుందుర్తిలో తప్ప అన్యత్ర లభించనంత విశిష్టుడు! తనను నిందించిన వారిని సైతం చిరునవ్వుతో పలకరించ గలిగిన హృదయ నైర్మల్యంగల అజాత శత్రువు వచన కవిత్వమూ ఒక కవిత్వమేనా అని కాలువాల చాటు నుంచి నవ్వుకొనే వీలయితే గేలి చేసే- సంప్రదాయచ్ఛందో బంధితులను సాదరంగా పలుకరించేవాడు మెల్లగా వాదనలోకి దించి చివరికి తన వాదాన్ని అంగీకరింప చేసేగాని విడిచేవాడు కాదు

ఆలాంటి కవి వ్యక్తి పత్నీ వియోగంతో అతలాకుతలం కావడంలో అబ్బురం లేదు ఆ చింతను కావ్యగత మొనర్చి రసావేశ స్థాయిని అక్షరాక్షరం లోనూ నిక్షిప్తమొనర్చడం గొప్ప సిద్ధి! వ్యక్తిగా అనుభవించిన విషాదాన్ని సార్వత్రిక మొనర్చి రస ధాతువులన్నిటినీ కొల్లగొట్టడానికి హృదయ నిర్భరత్వ మెంతో అవసరం! అదే కుందుర్తి సాధించిన చరితార్థత!

## వెలుగు సరస్సు లోకి దూకి

బ్రతుకులో ఉన్న పాలన్నీ తాను గటగటా త్రాగేసిందా హంస! మిగిలి ఉన్న నీళ్ళను తన జీవిత భాగస్వామి కవి పాలొనర్చింది ఆలా ఆనందం ఆమె భాగధేయం చేసుకొని నిష్క్రామీగా ఎగిరి పోయింది అదీ కావ్య ప్రారంభం అందుకే ఈ కావ్యానికి వేరే ప్రవేశిక అవసరం లేకపోయింది ఆమె ఎలా ఎగిరిపోయింది? బహుశా వెలుగు సరస్సులోకి దూకి ఉంటుంది నింగిలో వెండి మబ్బుల వెనకాల చీకట్లోకి పాకిపోయిందేమో! ఎలా వెళ్ళగలిగిందో తెలియదు వదలి వెళ్ళనని ఒట్టేసుకుంది ఇప్పాళ్లా

తాను కంటె వాకిట్లో కట్టేసుకోనే జాగ్రత్త పడ్డాడు అయినా ఎగిరిపోయింది హంస!

ఆ హంసను వెదికి తెచ్చిన వారికి— పదివేల పంక్తుల వచన కవిత వజ్రాల మూట కానుకగా ఇస్తాడు కవి! ఆ మాట పత్రికలవారు ప్రకటించాలని కోరుకుంటాడు తాను బహూకరించే వచన కవిత ఎలాంటిది? నవరసాల పన్నీటి మున్నీటి జలకాలాడించ గలిగేది నిజానికీ హంస ఎగిరిపోయింది- పదివేల పంక్తులు లేదన్న మాటేగాని, రసభరితమైన పన్నీటి కడలిగానే చదువరికి ద్యోతకమవుతుంది (నిజానికీ కావ్యం 515 పంక్తులే అంటే టి ఎస్ ఎలియట్ రచించిన వేస్టు లేండ్ (Waste Land) కావ్యంతో నిడివిలో సమానమైనది )

తాను పరధ్యానంగా పద్యాలల్లుకుంటూ కూర్చున్నాడు అయాచితంగా కాలం నది ఈ ఒంటరి తనాన్ని బహుమతిగా తన ఒడిలో పడేసి పారిపోయింది ఆ నదితోపాటు హంస కూడా ప్రవాహంలో కొట్టుకుపోయిందో ఏమో! ఆమె సాహచర్యంలో గడిచినది నిజంగా దరిద్రకాలమే! కాని ఆ కాలమే ఆమె మాధుర్య వల్ల నిర్నిద్రశోభస్కరంగా మారిపోయింది

అడుగు వేరల బడుగు జీవితం
గడుపుతున్న రోజులైనా
హంసతూలికా తల్పం మీద
పడుకున్నట్టున్న కాలంలో
లొక్కకుండా కరచిన పాముల్ని
లెక్కపెట్టేవాడిని కాదు!

ఆమె సాహచర్యం అంత మాధురీధురీణమైనది మరి! కాని యిప్పుడో నెత్తినపడ్డ ఒంటరి తనపు ఎడుగ్గా తయారైంది కష్టాల పాము పగ పట్టి తరుముతోంది

ఆ పాడు కాలంలో ఆమె సన్నిధిలో- చాలని జీతం రాళ్ళతో కాలని రొట్టెలే తిని కాలం గడిపాడు సీతాకోకచిలుకలు పెరట్లో ప్రదర్శనం పెట్టినపుడు, చూపులతోనే ఆ రంగు రంగు చీరలు ఒంటి మీద సింగారించుకొనేదామె! సువర్ణాభరణాలతో ఆమె గళ సీమను మెరిపించలేకపోయినా గోర్వెచ్చని కన్నీటి ముత్యాల సరులు ముసరుకొనేవి! ఎక్కుతున్న కుటుంబపు గుర్రం వెనక్కాళ్ళతో చాచి తన్నేది అప్పుడా హంస శరీర కాంతి- ధవళధావళ్యం నుంచి విరిగి బ్రతుకు నిండా కాకి రంగు క్రమ్ముకునేది ఆమె ధర్మపత్ని కనక తనతోపాటు చెరిసగం బరువూ కరువూ మోస్తూ బ్రతికింది

## కలల పూదోటలో ఊయల

కవిగా తనకు బహుమతులు లభించేవి అప్పుడా తని నిరుపేద నివాసం మహాసౌధంగా మారిపోయేది కొత్తకాంతిలో వెల్లవేసుకున్నట్లు మెరిసిపోయేది ఒక మహా కవిత్వ దీక్షా పారమ్య పారవశ్యంతో ఒడలు పులకరించేది కలల పూదోటలో ఉయ్యాలలూగేవి! అలాంటి సాహచర్య మాధుర్యాన్ని ఆ హంస తనకు లభింపజేసింది కని ఇప్పుడో ! పాతకాలపు లోతుల్లోకి ఎందుకో తోసేస్తోంది కాలం

ఆ విధంగా తొలి ప్రకరణం ముగిసింది రెండో సర్గ భయం తన జీవితం ఎంత భయంకరంగా మారిందీ వర్ణిస్తుంది ఒంటరితనపు బురద ఒంటి నిండా పూసుకొని పసిపిల్లవాడిలా దిగంబరంగా బజార్లంబడి తిరగడం నేర్చుకున్నాడు తనలో తానే కరుగుతున్నాడు పసిపిల్లవాడికి కడుపునిండా పరమాన్నం పెట్టి బలియివ్వడానికి తీసుకుపోతున్నట్టుంది కాలం ! ఆకాశపు ఆభరణాల షాపులో బంగరు తీగెల భ్రాంతి కల్పించే మెరుపు పాములు పారాడుతున్నాయి చీకటిలో తాను ఒంటరిగా వస్తూంటే- తన నీడ చెప్పా చెయ్యకుండా జారుకుంది కుంటి ఒంటెద్దు బండిమీద ఒంటరిగా ప్రయాణం చేస్తున్న తను చేర

వ లన ఊరేదో మరచిపోయాడు తనకా తోడులేదు తొంగిచూడ్డం భయం! అందుకే తన లోపలే తాను కూర్చుంటాడు!

నిరాశ అనే మూడో సర్గలో సుందర మధుర మైన చుక్క ఒక్కటి రాలిపోయినప్పుడు పక్షవాతం రాకుండానే తన రెక్క కూలిపోయినప్పుడు రోక టితో దంచిన నలగని పసుపుకొమ్ముల పసుమి వెళ్ళి పోయినపుడు తన లోపలా వెలుపలా ఎంత నైరాశ్యం అలముకుందో వర్ణితమైంది

కోపం అనే నాల్గవ సర్గలో

తన ఒడిలోంచి ఎగిరిపోయిన హంస - రాలిన రహస్యాక్షరాల రాశిలా - దూరాన తెల్లగా దుఃఖి తుడి బాధల వల్ల నల్లగా మండుతున్న మంచుకొండ లలో ఉంది కాబోలు! అయితే ఆమె ఉన్నస్థలం తెలిసింది కాని ఎలా వెళ్ళడం

ఎమానాలు ప్రతిరోజూ
ఒకటో రెండో విధిగా కూలుతున్న కాలంలో?
గూడ్సులూ రైలు బళ్ళూ
గుద్దుకుంటున్న రోజుల్లో ?

ఏ వాహనం ఎక్కి తానంత దూరం వెళ్ళగలడు? ప్రస్తుతం తాను అర్థపు అడవిలో చిక్కుకుపోయాడు మాటలకా అర్థాలు మరచిపోయాడు ఆమెయే తన జీవన నిఘంటువు మరి! అరవై ఏళ్ళ అసంపూర్ణ గ్రంథంలో అన్వయ దోషాలకోసం వెదికి ఏమీ లాభం లేదు ఏమైతేనేం? ఈ శేషజీవితంలో మహారణ్య మధ్యంలో ఒంటికాలి మీద కుంటికాలిమీద నిలచి ఇలా తపస్సు చేయవలసిరావడం ఎంత దుస్సహం మరి! చీకట్లు కవి హృదయం నిండా ముసురు కుంటున్నాయి

కవి తాను నాస్తికుడు కర్మకాండపై తన కావం తయినా నమ్మకం లేదు కాని దియాసంధువులైన బంధువుల మాత్రం యథావిధిగా కర్మకాండ జరగా ల్సిందేనని పట్టుపట్టారు విగతప్రాణి, కవిపత్నిని అవ మానిస్తున్నారు చిరాకు కలిగిస్తున్నారు ఆవిధంగా ఆరవ ప్రకరణం సాగుతుంది

### తేనె కడవ పగిలింది

సప్తమసర్గ - బరువు ససుతః చిన్నదే కవితా భావభరంలో ఉన్నదే! కావడి బుజాన వేసుకొని అడ విలో కాలం కాలువవెంట పరుగెత్తుతున్నాడు మనిషి కావడి బరువు వాడి కాళ్ళ వేగాన్ని నిర్ణయిస్తోంది దూరంగా చెట్టు కొమ్మల్లో గెరిల్లా ఎవడో దాగున్నాడు వాడు త్తనే వడిసెల ఝళిపించాడు ముందున్న తేనె కుండ పగిలింది తేనె కారిపోయింది చెట్టు క్రింద కూలబడ్డాడు మనిషి రెండోకుండ వుంది కదా ఎందు కంత నిరాశ? నిజమే రెండోకుండ ఉంది కాని అది ఉత్త నీటికుండ! కావడి తూకం సరిపోక తేలిపోతోంది ఎలాగో గుండె బరువుతో ఇంటికి వచ్చేసరికి కడవల నిండా కన్నీళ్ళు నింపుకొని కూర్చున్నారు స్వజన మంతా! తాను తెచ్చింది నీరే యింట సంసిద్ధమైంది నీరే! ఉత్తనీరు ఏం చేసుకుంటాడని?

నిజమే మరి హంస ఎగిరిపోయింది చేసేదిలేక మళ్ళీ ఆ మనిషి అడవి దారి పట్టాడు

ఎనిమిదో ప్రకరణం - తపన సమస్త సముద్రా లను ఊహించిన మన పూర్వులు రక్తసముద్రా లూహించలేదు ఎందుకనో మరి ఆ పని తనకు మిగిల్చారు ఆసుపత్రి బెడ్ మీద రక్తసముద్రంలో తేలుతూన్న తెల్ల హంసను తాను కళ్ళారా చూశాడు కవి ఆసుపత్రి అబద్ధాల పుట్ట ఇంకా చావని శవాల గుట్ట! కాని తన హంసకు మాత్రం లోపల లోపల సాహచర్య ధమని తెగిపోయింది కాలం పెద్ద నెత్తురుముద్దయి ఎర్రగా తన్ను చూస్తోంది అప్పుడు తాను హంస పాడిన చివరిపాటను చితిపేర్చిన కాటి కాపరి నోటగా విన్నాడు!

తొమ్మిదోసర్గ - భ్రాంతి మెరుపు మెరిసి ఉరుములురిమి మిన్ను విరిగి మీద పడిన" దుర్భర

దుఃఖాశ్రువు లొలికిస్తూ సాగుతుంది ఎవరో ఆకాశం కుంచెలో విషం కలిపిన మందిరాన్ని పట్టి వున్నారు ఆకాశ వాంప ఒంటినిండా నక్షత్రాల పుండ్లు పడ్డాయి జ్ఞాపకాల పేకలు కాయిపట్టిన మొసళ్ళు ఏ అఖాతాలకో లాక్కుపోతున్నాయి

కవి పత్ని నామధేయం కావ్యంలో ఎక్కడా పేర్కొనడు కవి ఆమెను హంసగానే వ్యవహరిస్తాడు కుందుర్తి ఎంత నల్లని దేహయష్టి కలవాడో కవి పత్ని అంత పచ్చని పసుమి శరీరవర్ణం కలది కనక ఆమెను హంసగా వ్యవహరించడంలోనే వైచిత్ర్యం సాధించాడు కవి

పదోసర్గ విసుగులో ఒక కవిగారి యింటిమీద సరావాన కురవడాన్ని వర్ణిస్తుంది బస్సు దిగి వస్తున్న బంధువుల చూపులు మెట్లమీద కాళ్లారి మూర్ఛపోతున్నట్లున్న పరిస్థితిని బొమ్మ వేసి చూపుతుంది పుష్యమాసపు చలి పులి వచ్చి కాటందుకుంది చీకటికి తడిసిన చెట్లు జుట్టారబెట్టుకుంటున్నాయి తల ప్రక్కన పెట్టిన దీపాన్ని ఆర్పేసింది చీకటి గోడమీద తన నీడ నిజమైనా కుప్ప కూలిపోయింది పల్లకికి బొంగు తగులపడి బొగ్గుల నుసి రాలిపోయింది తనపై ప్రకృతి కసి పూనింది చీకటి తెరల వెనకాల దయ్యాలు రహస్యాలు చెప్పుకుంటున్న గుసగుసలు! హఠాత్తుగా గదిలో గడియారం ఆగిపోయింది తన్ను ఏడుస్తున్న చంటివాడ్ని చేసింది చీకటిరాత్రి!

### ఒళ్ళు కాలి ఉబ్బిన బొబ్బలు

పదకొండో ప్రకరణం బాధ స్మృతుల రణగుణధ్వనులు వినిపిస్తుంది ఒళ్ళుకాలి ఉబ్బిన బొబ్బల్లా బాధిస్తున్నాయి స్మృతులు! మాటలు చేతలు మనసులోని అంతరార్థాలు, అరలు తెరలు — అన్నింటా స్మృతులే స్మృతులే!

హంస ఎగిరిపోయింది కావ్యానికి చరమాంకం — విరక్తి ఆదే జీవుడికి చివరగా ఎదురయ్యేదీ, మిగిలేది! గుండెల్ని బంతులుగా మార్చి బ్రతుకుబరువులతో పొల్లించేది విరక్తి ఏకాంతంలో తనతో తనే మాట్లాడుకుంటూ గడుపుతున్నాడు కవి ఆకాశం చాప పరిచి మబ్బుల (పేక) ముక్కలు కలిపి తానొక్కడే ఆడుకుంటున్నాడు అవును మరి శేషజీవన మహావాహిని దాటడానికి విరక్తి వంతెన! అయినా తన జీవితం కంట్లో నలుసుగా మారింది శేషజీవితం తనకి నలుసంతే వుంది అయినా అది కంట్లో పడి సలుపుతోంది దుఃఖార్తికి అడ్డుకట్టలు తెంచింది కదులుతున్న కాలువలో కాగితం పడవలు వొదులుతున్నాడు గుండె కుంపట్లో నిప్పులు రాజేసి మనసు మాలిన్యం కడిగిన గిన్నెలో బియ్యం పోశాడు ఊహల విసనకర్రతో విసురుతున్నాడు పసివాళ్ళతో కలిసి 'అన్నాలాట' లాడుకుంటున్నాడు

రెప్ప పాటు బ్రతుకు కోసం ఎందుకింత రభసో తనకు తెలీదు తానా బ్రతుకంతా కావ్యలోకపు వీధుల వెంట తిరిగాడు ఏడుస్తూ గడిపాడు

హంస ఎగిరిపోయిందనే ఈకావ్యాన్ని 23 2-82న ముగించినట్లు శ్రీ కుందుర్తి తేదీ గుర్తించాడు అంటే అతనికి పత్నీవియోగం సంభవించిన మొదటి రెండు నెలలూ సంపూర్ణ ధ్యానంతో ఈ కావ్య రచన సాగించాడు నిజ జీవితంలోని ఎన్నో స్మృతులు స్థూల స్వరూపాలకు ప్రతీకల చాటులో, పదచిత్రాల నేపథ్యంలో సూక్ష్మాకృతులు కల్పించాడు

ఈ కావ్యానికి హిందీ అనువాదం సంసిద్ధం కావడంలో జరిగిన జాప్యం వల్ల కవి బ్రతికుండగా ఈ కావ్యం అస్మదాదిమిత్రుల అభిప్రాయాలతో గ్రంథంగా ప్రచురింపబడే సదవకాశం లేకపోయింది హంస ఎగిరిపోయిందికి ముందే రచించబడది మేఘ

మాల అనే లఘు కవితల సమాహారం! కనుకనే కుందుర్తి కవితా యాత్రలో హంస ఎగిరిపోయింది చరమ కావ్యమే కాక — కవి జీవన గాథలో సైతం చరమాంకమే!

చీకటిగా దిగులుగా అడవిదారుల ఒంటరి రాత్రిలా బరువు గుండెమీద దుఃఖాల రెక్కలు కప్పుతూ ఈ కావ్యం ముగిసిపోతుంది దుఃఖనౌకల సహకారంతో తప్ప - జీవుడీ లోకాన్ని తరించనే లేడేమోనన్న ధ్వనితో ఈ కావ్యం ముగుస్తుంది అంత దుఃఖ భారంలోనూ ఏదో సహజకాంతిపుంజాల కోసం నిరంతరం అన్వేషిస్తుంది అందుకే బోరిస్ పాస్టర్ నాక్ అనే రష్యన్ మహాకవి ఇలా అంటాడు

By the road age old midnight stands sprawts on the track way with its stars you cannot pass the hedge without Trampling upon the universe

ఈ కావ్యంతో సోదర ప్రజల ముందుకు వచ్చి నిల్చుందామని ఆశించిన కుందుర్తి బ్రతుకు వెలుగులపై తెరజార్చి - అక్టోబరు నెల ఆక్టోపస్‌లా అదృశ్యమైంది ! *

కళానికేతన్ ఎరాపురం 533 450 AP

# గుంరి

—చీకోలు సుందరయ్య

నా భావాలు
అనురాగాంకిత
ప్రఫుల్ల
మనోరంజనాలు
నా ఆశయాలు
సమభావాంచిత
సుస్థిర
సోపానాలు
నా గీతాలు
భయాందోళ నాక్రోశములకు
స్వస్తి వచనాలు
మహోజ్జ్వల భవిష్యద్భానునికి
సుప్రభాతాలు
నా చూపులు
కుటిలకపట కరటకదమనకుల
భస్మీకరించు
అగ్నిగుండాలు
దైన్య హైన్య మానవాక్రందనలకు
కరిగే
కన్నీటి కుటీరాలు
నేను
మేముగా
వసించి
హసించి
విజృంభించి
కృశించు
నశించు
క్షుదార్తుల
వ్యథార్తుల
ఆకలిమంటలు
ఆర్పేస్తాం
చీకటికప్పును
తోసేస్తాం
తరతమ భేదం
తొలగిస్తాం
హద్దూ పద్దూ
చెరిపేసాం

రెడ్‌హిల్స్ రోడ్డు ఒక్‌డీకాపూల్ హైదరాబాదు-500 004

# సహస్ర జీవాల అనుభవాలను సూచించే దిక్సూచి

—డాక్టర్ కోవెల సుప్రసన్నాచార్య

ఈ జగత్పరిణామం రెండువిరుద్ధలక్షణాలవల్ల కొన సాగుతూవున్నది ఒకటి సంఘర్షణ రెండవది సమన్వయం ఈ రెండూ కలసి సాగుతూవుంటవి సంఘర్షణ ఒక దశలో సమన్వయంగా పరిణమిస్తుంది సృష్ట్యాదినుంచీ దైవాసుర శక్తుల మధ్య సంఘర్షణ ఉన్నది భూతకాలానికీ భవిష్యత్తుకీ వర్తమానమనే లంకే సమన్వయ రూపంగా ఉన్నది

అయితే ఈ పరిణామంలో సమన్వయ దశ చేరుకోవడానికి ముందున్న సంఘర్షణ- భవిష్యత్తు యొక్క భవ్యరూపాన్ని మన ముందు సాక్షాత్కరింప చేయలేదు సర్వమూ అభద్రముగా అనిశ్చితముగా గోచరిస్తుంది ఈ నిరాశా నిస్పృహల తాకిడిని వ్యక్తం చేయడం మానవ కళారూపాలలో ఉన్నది అయితే ఈ కళారూపం క్రాంత దర్శనం చేసినప్పుడు రాబోయే సమన్వయ రూపాన్ని కూడా ఆవిష్కరిస్తుంది అప్పుడు అది మహాకావ్యము - ఇతిహాసము అవుతుంది దాన్ని చేరుకోవడానికి సాగే సాధన ముక్తకాది రూపాలలో ఉంటుంది

రావూరి భరద్వాజ జీవనసమరం ఒక విచిత్ర గ్రంథం ప్రసిద్ధమైన సాహిత్య ప్రక్రియలలో ఏ రూపంలోనూ దీన్ని బంధించేందుకు వీలులేదు అది అనేకమంది వ్యక్తుల జీవితంలోని ఆవేదనను వారి మాటల్లో చిత్రించబూనుకున్న రచన ఈ గ్రంథంలో వ్యక్తులందరూ విభిన్న దశలలో జీవితంకోసం సంఘర్షణ పడుతూ వున్నవాళ్ళు ఈ జీవితం విభిన్న మార్గాలకు చెందింది దాదాపు అందరూ పరంపరాగతంగా వస్తూవున్న జీవన వృత్తుల పాదులలో నుంచి బలవంతంగా పెరికివేయబడ్డవాళ్ళు కొత్తచోట పాదుకోలేకుండా ఉన్నవాళ్ళు ఇందరి జీవితాలలోని చీకటివెలుగులను వ్యక్తం చేయడమే జీవనసమరం సాధించిన విజయం

ఇవన్నీ విస్తృతంగా చెప్పబడ్డ ఇతివృత్తాలు కావు ఆయా జీవితాలను రేఖామాత్రంగా స్ఫురింపజేసే అంశాలు ఏ చిత్రానికి ఆ చిత్రం స్వయం సంపూర్ణమే అయినా ఇవన్నీ కలిసి వర్తమాన కాలంలో మన దేశంలోని పరంపరాగతమైన వ్యవస్థ కూలిపోయి జీవితావసరాలకు నోచుకోని అత్యధిక కుటుంబాల సమిష్టి వేదనను వ్యక్తం చేస్తున్నవి ముక్తకమని ప్రాచీనుల నిర్వచనానికి ఇది పూర్తిగా ఒదుగకపోవచ్చుగాని ఈ ఫీచర్ పరంపరను వ్యష్టిగాదా సంపుటిగా ముక్తకములుగా భావించవచ్చు

బ్రహ్మానందం అనే కమ్మరి జీవితం గూర్చి భరద్వాజ చిత్రణ చూస్తే ఒక కొంత ఈ విషయం తెలియవస్తుంది

ఇంకోరి దగ్గర నేర్చుకోవలసిన అవసరం నాకేం లేదండీ మా తాత ఈ పని చేశాడు మా నాన్న చేశాడు నేనూ కొంత కాలం చేశాను

పల్లెటూళ్లు ఇదివరకులాగా లేవండీ అంతా తెలివిమీరిపోయారు నాకు పదిహేను అరకలుండేవి అరక్కు పదిహేను మానికల జొన్నలు కొలిచేవారు కందులు పెసలు శనగలు పండితే అడ్డెడు మూడు మానికలదాకా పెట్టేవాళ్ళు ఇప్పుడు ఆ ఎత్తులన్నీ మారిపోయాయండీ! ఇదివరకూ లాగా గొడ్డూ గోదా పొలాలకు రానివ్వడం లేదు నేను పుట్టి బుద్ధెరిగిన తరువాత పాలూ, పెరుగూ మజ్జిగా కొనుక్కోలేదండి

ఇంటికి చుట్టమొచ్చినా ఏ రైతు ఇంటికెళ్లినా చింత గింజేస్తే మునగని మజ్జిగ దొరికేది వాడి నిండ కూరగాయలేసి పంపేవాళ్లు (పే 3234)

ఈ వాక్యాలు కేవలం ఉదాహరణగానే వచ్చినవి దీనివల్ల ఒక చిన్న వృత్తి అవసరం తగ్గిపోవడంతో ఎన్ని ఎన్ని కుటుంబాల జీవన స్థితిగతులు మారి పోయాయో తెలుస్తుంది

బ్రహ్మానందం వెల్లడించింది కేవలం తన వృత్తిని గూర్చి మాత్రమే కాదు దాదాపు నాటి పల్లెలో ఉన్న వృత్తులన్నిటి సంగతీ అంతే నాడు వృత్తు లన్నీ వంశపరంపరగా వచ్చేవి ఒక్కో పనిలో ప్రావీణ్యం చిన్ననాడే అలవడటం చాలా సులభ మయింది చేతికి వచ్చిన కుర్రవాడు ఏ వృత్తిలో ప్రవేశించాలె ననే చింత నాడు లేదు గ్రామం గ్రామం అంతా ఒక సమిష్టిఅంశంకావడంవల్లే ఎవరికీ ప్రాథమి కావసరాలకు లోపం ఉండేది కాదు పండిన ధాన్యంలో అన్ని వృత్తుల వాళ్ళకూ రైతు పంచి యిచ్చేవాడు అట్లాగే ఇతర వృత్తుల వాళ్ళు తాము ఉత్పత్తి చేసే అంశాలను మిగతా వాళ్లకు అందించే వారు అయితే ఆనాడు డబ్బు ప్రాధాన్యం లేదు పరస్పరం ఆధారపడ్డ సమష్టి కుటుంబం లాంటిదే నాటి గ్రామీణ వ్యవస్థ ఈ వ్యవస్థలో ఎవరికి ఏ కష్టం వచ్చినా ఆదుకోవడం గ్రామ బాధ్యత అల్లాగే సుఖాన్ని పంచుకోవడం కూడా ఆనాటి పరిస్థితే

బ్రిటిషువాళ్ళు ఈ దేశానికి వచ్చేదాకా గ్రామ వ్యవస్థ ఎన్ని ఆటుపోటులకు గురైనా ప్రాథమిక స్వరూపం చెక్కు చెదరలేదు ఇంతకాలం నుంచీ ఈ దేశప్రజలు ఈ సరళమైన స్థానిక ప్రభుత్వం (గ్రామ వ్యవస్థ) క్రింద జీవించేవారు గ్రామాలు యుద్ధాల వల్లా కరువుల వల్లా వ్యాధులవల్లా క్షతిపొందినా కొన్నిసార్లు నశింపజేయబడినా గ్రామాల సరిహద్దులు చాలా అరుదుగానే మారాయి గ్రామాలకి యుగాల నుంచీ అదేపేరు అవేసరిహద్దులూ — అవే అవసరాలతో అవే కుటుంబాలు జీవించాయి గ్రామీణులకు రాజ్య వ్యవస్థలో విభాగాలు జరగడంతో నిమిత్తం లేదు రాజ్యాధికారం ఎవరికి మారిందో వారికి అవసరం లేదు వాళ్ళ ఆర్థిక వ్యవస్థలో ఏ మార్పూ వచ్చేది కాదు గ్రామ పెద్ద (పటేలు) పన్నులు వసూలు చేసే వాడుగా న్యాయాధికారిగానే ఉండేవాడు ఆర్ సి దత్ భారతదేశ ఆర్థిక చరిత్ర అన్న గ్రంథంలో (పార్ట్ 1 పే 81) లో పేర్కొన్నాడు భారతదేశం ఆ విధ మైన సువ్యవస్థితమైన స్థితి నుంచి గడిచిన రెండు వందల సంవత్సరాలలో విపరీతమైన మార్పులకు గురైంది

సమాజ వ్యవస్థకు కేంద్రం గ్రామం స్థానంలో పట్టణమయింది గ్రామంలోని సమిష్టి జీవనతత్వం పట్టణంలో విచ్ఛేదం పొందింది ఉత్పత్తికి వినియోగా నికి మధ్య దళారీ వ్యవస్థ బలపడ్డది ఈ దళారీ వ్యవస్థ అటు ఉత్పత్తిదారులనీ ఇటు వినియోగదారులనీ వీలైనంత దోపిడీ చేస్తున్నది సమాజ జీవనంలో ప్రత్యంశమూ ఈ నూతన వ్యవస్థ మీద ఆధారపడ వలసవస్తున్నది ఈ కొత్త ఫ్యూడల్ వ్యవస్థ కొత్త పెట్టుబడిదారీ వ్యవస్థలు సమాజాన్ని శుష్కింప జేశాయి పల్లెటూళ్ళ నుండి జనం తరలి రావడం జరుగుతున్నది అయితే పారిశ్రామికీకరణం సాంకే తిక పురోగతి దీనికి అనువయిన స్థాయిలో పెరుగక పోవడం వల్ల జనం వృత్తులైతే కోల్పోయారు కాని వారికి నూతన వృత్తులు ఏర్పడలేదు ఈ భద్రతా భావంలో నుంచి ఎరికితనం వచ్చింది నైతిక మూల్యాలు తారుమారయ్యాయి ఆర్థిక సాంఘిక నైతిక రంగాలలో ఇంతకు ముందెన్నడూ లేని ఒక సంక్షో భాన్ని భారత సమాజం ఎదుర్కొనవలసి వచ్చింది ఈ సంక్షోభమే జీవన సమరం గ్రంథానికి ఇతివృత్తం

2

ఈ రేఖా చిత్రాల సంపుటిలో ఎన్నో విచిత్రాలు కనబడతాయి వ్యక్తులు తమ భావాన్ని వ్యక్తం

చేసేప్పుడు గుండె లోతుల్లోంచి పలికేట్లు వేరొడు రచయిత రచయితతో మాట్లాడెప్పుడు వాళ్ళకే విధమైన సంకోచాలు లెవు ఎదుటివాడిం సమాన ధర్మం చూచి ప్పుడే ఏ వ్యక్తికైనా గాఢమైన సంస్పందం కలుగుతుంది అలా సంస్పందం పొందిన వ్యక్తులు పలకడం వల్లనే జీవన సమరం ఒక జీవిస్తున్న సమాజచిత్రణ (లివింగ్ సోషియల్ డాక్యుమెంట్) అయింది

సమాజంలోని సత్త్వరాహిత్యమూ, ఎరికితనమూ లోపల ఏమీ లెకున్నా పైకి ఆడంబరంగా కనిపించాలనే తత్త్వము అంతా ముని కిన్నయ్య వ్యాఖ్యలో వ్యక్తమౌతుంది ఏం బ్రతుకులే అయ్యగారూ! ఈ మిరాయిలాగే ఉంటుందండీ! చూస్తే ఇంత లావుగా బుజబుజలాడుతూ ఉన్నా - కొక్కితే చింతగింజంత కూడా సరుకు ఉండదు సమాజంలోని మూల్యాలు శూన్యమైన డొల్లతనాన్ని వ్యక్తం చేయడానికి ఇంతకన్నా వేరే గొప్ప వ్యాఖ్య అవసరం లేదేమో!

ఈ వ్యాఖ్య వెనుక అతని జీవితం ఎంతో ఉన్నది రైలు దగ్గర మూటలు మోస్తూ ముని కిన్నయ్య ఒక ధనికుడు మూటలు మెయించుకొని బండి కదిలే వేళకుకూడా డబ్బులివ్వకపోతే బండి చువ్వ పట్టుని వ్రేలాడి పట్టుదప్పి పడిపోయి కాలు పోగొట్టుకున్నాడు ముని కన్నయ్య బతుకు బుగ్గయింది అయితే ఇక్కడ ఆ ధనికుని మనస్తత్వం చూడవలసింది ఎంత డబ్బు ఎన్నెన్నో విలాసాలకు ఖర్చు చేస్తూ కూడా చేయించుకొన్న కూలి డబ్బులు యివ్వడంలోని ప్రలోభ బుద్ధి ఆ వ్యక్తికే కాదు సమాజంలోనే ఈ నైతిక బాధ్యత మీద విశ్వాసం తొలగిపోయింది స్వాతంత్ర్య సమర యోధుడైన నరసారెడ్డిగారు చనిపోయాక ఆయన భార్యను ఆయన మీది రాజకీయ కక్షతో ప్రత్యర్థులు నానా యాతనలు పెట్టారు ఆయన ఆస్తినంతా అన్యాక్రాంతం చేశారు (పేజి 2)

ఈ విషయమే మరి కొన్ని చోట్ల కూడా చెప్పబడది వీరగాథాకథనం చేస్తూ తిరిగే 'వీరముని రామకిష్టయ్య ఇలా అన్నారు ఆ కాలమే వేరు ఆ రోజులే వేరు ఇప్పుడంతా మిడిమేలపు సరుకు బాబుగారూ! ఓ భయం లేదు భక్తి లేదు చూస్తూ చూస్తూ వుండగానే నా కళ్ళ ముందే లోకం పాడయింది (పేజి 57) అతనే ఆకలంటే దరిద్రమంటే ఎరుగని తమ చిన్నతనానికి ఉన్నదేదో బిడ్డలు కింత పెట్టి చెంబెడు నీళ్లు త్రాగి కరకరలాడె ప్రేగులతో ముడుముకు పడుకునే ఈ ముదనష్టపు కాలానికీ సాపత్యమే లేదని అభిప్రాయపడ్డాడు (పే 59) వీరముష్టి రాంకిష్టయ్య దేదో భూతకాలపు దృష్టి కావడం వల్లనే ఈ అభిప్రాయం ఏర్పడలేదు సమాజంలో ఉన్న ఆత్మ ప్రత్యయరాహిత్యం ఎన్ని పొరపాట్లను వరుసగా చేయిస్తున్నదో అతడు తిరుగుతూ తిరుగుతూ కళ్లారా చూస్తున్నాడు ప్రతీపవాద దృష్టికాక అతనిది వాస్తవ పరిస్థితులను వాస్తవంగా అర్థం చేసుకునే దృష్టి దీని కోసం ఏ ఇజాల కళ్లద్దాలూ అవసరం లేదు పాతగుడ్డలకు స్టీలు పాత్రలు చ్చే కేశవులు జీవితం పరిశీలిస్తే ఈ విషయం గోచరిస్తుంది "నేను సోమరిపోతును కానండీ కానీ కాలానే నేను సోమరితనాన్ని అలవాటు చేసుకొన్నాను పది రూపాయలున్నాయను కోండి పనిచేయ బుద్ధికాదు " అన్న కేశవులుకి జీవితంలో స్థిరపడాలని గాని కుదురుగా వుండాలని గాని లేదు పులిజూదం పేకాటలు ఆడతాడు తాగి తందానా లాడతాడు ఓ నెల రోజులు ఎడి వార్డులో ఉన్నాడట తాను సక్రమంగా బ్రతుకలేదనుకోండి మాయ చేసి బ్రతుకుతా నంటాడు (పే 54 55) తన చుట్టూ మునిరిన సమాజం మీద గల ద్వేషాన్ని తీర్చుకునే మార్గం లేక తనమీద తానే తీర్చుకుంటున్న కేశవులు ఈనాటి ఒక నెగెటివ్ మనస్తత్వాన్ని అలవరుచుకున్న అలవరచుకుంటున్న తరానికి ప్రతినిధి ఇప్పుడా తత్త్వాన్ని బలంగా ప్రబోధించే వరాలవారు రాజకీయంగానే కాక కళా సాహిత్యరంగాలలో కూడా ప్రాధాన్యం సంపాదించే ప్రయత్నంలో ఉన్నారు

సమాజం మిరాయిలాగా బుజబుజలాడుతూ వున్నా లోపల చింతగింజంతైనా సరుకు వుందనడానికి చల

పతిరావు ఉదాహరణ చలపతిరావు తండ్రి కాంగ్రెసు వాది రాజకీయాలవల్ల ఆస్తి ఊడ్చిపెట్టుకుపోయింది చివరకు దిక్కు లేక హోటల్లో పనికి కుదిరి గదుల్లో సిగెరెట్లూ మద్యమూ అందిస్తూ వచ్చాడు అయితే ఒక సారి ఎవరో కంట్రాక్టర్లు తప్పతాగి అమ్మాయికావాలని అడిగినప్పుడు అతని అంతరాత్మ ఘోషించింది అతడు ఇంకా ఆ ఉద్యోగం చేయలేకపోయాడు నిజాయితీతో ఇంకో వృత్తిని ఎన్నుకొన్నాడు (పే 60 62)

కేశవుల జీవితాన్నీ, చలపతిరావు జీవితాన్నీ ఎదు రెదురుగా ఉంచి పరిశీలిస్తే సమాజంలో రెండు పార్శ్వాలూ గోచరిస్తవి ఆత్మ విశ్వాసం లోపించిన కేశవులు అపమార్గం పడితే చలపతిరావు ధైర్యంతో జీవన సమరం కొనసాగిస్తూ వున్నాడు కేశవులు మానసికంగా సమాజంతో దూరంగా పారిపోయి ఏకాకియై చుక్కాని లేని నావగా జీవిస్తూ వుంటే చలపతిరావు తనజీవనాన్ని ఓస్పష్టమైన అవగాహనతో ఉత్తమ లక్ష్యంతో సాగిస్తున్నాడు

సమాజంలో తానూ అభిన్నమైన అంగమేనని దాని మంచి చెడులో తన భాగమున్నదనీ బాధ్యత గల పౌరుడు అంగీకరిస్తాడు చలపతిరావు వంటి యువకులే లక్ష్యాన్ని చేరుకోగల సమరయోధులు లక్ష్యాల శిఖరాలను అధిరోహించగల దీక్షాదక్షులు అందుకే చలపతిరావు జీవనరేఖకు శీర్షిక భరద్వాజ గంగిగోవు పాలు అని ఉంచడం జరిగింది

3

రావూరి భరద్వాజ ఈ గ్రంథ రచనా ప్రయత్నం చాలా క్లేశకారకమైనది ఈనాడు సమాజంలో అనేక వైవిధ్యం ఉంది ఎందరో వ్యక్తులు ఎన్నో వృత్తులు ఎందరినో కలుసుకొవడం ప్రశ్నించడం దాన్ని చదువుకునేందుకు వీలుగా పాఠకులకు అందించడం రచనా విధిలో ఎంత క్లేశముంటుందో అది వ్యక్త మయ్యేప్పటికి అంత సరళంగా గానవస్తుంది చిలికిన తరువాత ఎంతోమృదువైన వెన్న బయలు వెడలినట్లు గ్రాంథిక కౌశల మంటే యిదే

ఈ గ్రంథంలో భరద్వాజ ఎన్నో పార్శ్వాల నుంచి సమాజాన్ని చూపించటం జరిగింది సంక్లిష్ట లక్షణమే ఈ గ్రంథానికి ఏకవాక్యత కలిపిస్తున్నది అదే దీనికి అనుభూతిక సంసార మూల గర్భంలో ఉన్న దుఃఖాంశమే ఈ గ్రంథం అట్టడుగున ఒక అపస్వర సంకులమైన హిందోళ రాగంగా వినవస్తు న్నది ఈ గ్రంథానికి తాత్పర్యము అది ప్రసిద్ధ నవలా రచయిత యైన భరద్వాజ ఈ కల్లోలానికి ఒక గాథా రూపమిస్తే అది ఇతిహాసం గాకుండా పోదు

జీవన సమరంలో ఎన్నో వృత్తులను పరిశీలించ డం జరిగినది ప్రాచీనకాలం నుంచీ వస్తూ వున్న శిల్ప విద్య నేడు పోషణ లేకుండా పోవడం వలన ఎలా క్షీణించిందో ఆగమయ్య చెబుతాడు (పే13 17) ఆగమయ్య తండ్రి బనగానపల్లి నవాబుకు రాతి మంచ చేసి యిచ్చాడు ఒక్క రాతితోనే కోళ్ళు నిలువు పట్టెలు కూజాలు చెక్కడం ఎంతో అసాధా రణమైనపని నాడు వృత్తి జీవనాధారమే కాదు అదే దైవం అందుకే ఆగమయ్య అమ్మవారి విగ్రహం చెక్కుతూ హఠాత్తుగా పాదం విరిగితే తాను రెండు రోజులు గంగ కూడా ముట్టలేదు మళ్లీ దీక్షగా దేవా లయం ముందర కూర్చొని, ఆరోజుల్లో అమ్మవారి విగ్రహం పూర్తిచేశాడు అతని శాస్త్రజ్ఞానమంతా చదువు కోకుండానే వంశపారంపర్యంగా వచ్చింది ఆ విద్యల స్వరూపం కేవలాక్షరాస్యతకాదు అది జీవన తత్వం వృత్తీ ప్రవృత్తీ మేళవించేవి శాస్త్రం అంటే ఆవృత్తిలోని రహస్యాలను సూక్ష్మాంశాలను ఎరిగి వుండడం అన్నట్లుగా ఈ విద్య అంతా ఇంటిలో నుంచే సంక్రమించేది వీరాస్వామికి నేత పనిలో నైపుణ్యం అలాగే సంక్రమించింది (పే 38) కాశిం తండ్రి నేర్చిన వడ్రంగి పనీ మరో పనివాడి దగ్గర నేర్చిందే (పే 171) అన్ని వృత్తులూ అంతే అయినా ఆ వృత్తులు వాటి సమాజ వ్యవస్థలో తిండికి లేకుండా చేయలేదు కుండలు చేసే గురవయ్య

అంటాడు- అసలు చదువేది ఎరుగ మండీ! ఏ అయ్యకాళ్ల దగ్గర కెళ్లినా గూడ కుంగిపొయ్యేది మూల మొయ్యిలేక పెళ్లక్లయితేనండి ఖర్చు అంతా ఊరే పెట్టుకునేది" (పే 101 02) సమాజానికీ వ్యక్తికీ నడుమ ఉన్న ఆ సమన్వయ సూత్రం తెగిపోవడం వల్లనే ఈ అస్తవ్యస్త వ్యవస్థ ఏర్పడింది వ్యక్తి పోషణ కాకుండా అతని ఇంటిలోని శుభ కార్యాలు కూడా సమాజం తనవిగానే భావించిన కాలానికీ —ఒక కుటుంబంలోనే వ్యక్తుల మధ్య సమతా సూత్రం లోపించిన ఈనాటి సమాజానికీ మధ్య పోలిక ఎట్లా చెప్పడం! అదే శ్రమశక్తి ఈనాడు ఈ స్థితికి ఎందుకు దిగజార్చింది? గృహ నిర్మాణం చేసే శేషయ్య ఈ ప్రశ్నకు ఇలా సమాధాన మిస్తాడు- పనిచేసే వాళ్ళం ఇల్లానే ఛస్తుంటిమి పని చేయించే గుత్తేదారు కార్లమీద తిరుగుతుండె" వస్తువుకూ వినియోగానికీ ప్రత్యక్ష సంబంధం లేదు వినిమయం పేర పెరిగిన మధ్యవర్తులు ఒక భయంకరమైన స్థితిని కల్పించడం జరిగింది ఈ మార్పులో ఆగిపోయిన వృత్తులు ఎన్నో కొన్ని వృత్తులకు ప్రత్యామ్నాయ వృత్తులు ఇంతకు పూర్వం ఆ వృత్తి మీద ఆధారి పడ్డ వాళ్లకు తిండి పెట్టడం లేదు నేత వృత్తి అలాంటి వాటిల్లో ప్రముఖమైంది అది సుఖాపాదన చెయ్యని పారిశ్రామికీ కరణం కొంతమందిని ధనికులుగా చేయడం కోసమేనా వచ్చింది? ఈ ప్రశ్నకు గాంధీజీ పరిష్కారం చూపించారు అయితే స్వాతంత్ర్యం వచ్చాక మనం మన నేతలు గాంధీజీని మరచిపోయి దేశ అవసరాలక దేశపరిస్థితులకు అనుగుణమైన పరిశ్రమల నిర్మాణం బదులు పాశ్చాత్య దేశాల మార్గాని ప్రయాశించడం జరిగింది అందువల్ల స్వాతంత్ర్యం తరువాత ఈపరిస్థితి ఇంకా భయంకరమైన రూపం దాల్చింది భరద్వాజ మాటల్లో "ప్రజా జీవితం రోజు రోజుకూ దిగజారిపోతున్నది భవిష్యత్తు అయోమయంగా తయారవుతున్నది

బ్రిటిష్ విద్యావిధానం ఈ దేశంలో ఇంతకు పూర్వం వున్న వృత్తి విద్యల సంబంధాన్ని తెంపి వేసింది ఒక సామాన్య విద్యా ప్రణాళిక ఏర్పడింది విద్యాలయాలలో నుంచి బయటకు వస్తున్న విద్యార్థులు తమ యింటి వృత్తితో సంబంధం లేకుండా స్వయంవ్యక్తులుగ తయారౌతున్నారు ప్రభుత్వోద్యోగాలకోసం గాను ఏర్పడ్డ ఈ చదువులు, తదితరంగా ఏ ప్రయోజనమూ లేకుండా పోతున్నవి ప్రభుత్వోద్యోగాల పరిమితి దాటిపోయి "ఈ చదువు చదువుకున్నవారు తమ ఆశా సౌధాలు కూలిపోగా నిరాశా నిస్పృహలకు స్థానమవుతున్నారు నేటి విద్యా ప్రమాణాలలో ఒక పద్మనాలి ఒక కమ్మరి ఒక కుమ్మరి ఒక జాలరి ఒక ఉప్పరి వీరెవరూ విద్యావంతులు కారు ఈనాడు విద్య శ్రమవాహక కాదు - భోగ సాధిక మాత్రమే

రంగుల రాట్నాలు తిప్పే జాఫర్ ఇంతవరకు చదివిందే నాకు పనికిరా ప్పుడు ఇంకో ఏడాది ఈ ఈ ముష్టి చదువుకోసం నెను వృధా చేయనండి! అంటాడు (పే 8 ) శామ్యూల్ ఆనందరావు తెలివితేటలుండి ఇంటో పరిస్థితుల వల్ల ఎయువు బి ఏ దాకానే సాగించగలిగాడు అదీ స్కాలర్‌షిప్పు మీద (పే 51) అతడు ఈ దేశంలో చదువుకున్నవాడికి బతుకుతెరువు లేదు అంటాడు ఈ రెండు ఉదాహరణలూ చదువులు ఎలా ప్రయోజనరహితాలుగా పరిణమించాయో చెప్పడానికి చాలు

ఇది ఎచిత్రమైన సంధికాలం గ్రామీణ వ్యవస్థ కుటుంబవృత్తులూ కూలిపోయాయి పట్టణ నాగరికత పారిశ్రామిక వాతావరణం పెరిగింది ఈ సంఘర్షణలో వృత్తులు పోయిన వాళ్ళకు కొత్త వృత్తులు రాలేదు నాటి సమాజం శాంతంగా ఋజువుగా సాగడం వల్ల ఏ ఆటుపోట్లు లెకపోవడం వల్ల నెలకొని ఉన్న నైతిక మూల్యాలు అన్నీ పనికిరానివయినాయి

అశాంత స్థితిలో విచ్ఛిన్న ధోరణిలో నైతిక మూల్యాలు నిలువవు అప్పుడే సమాజ విధ్వంసక ధోరణులు ప్రబలుతాయి అయినా అలాంటిది బాబయ్యా! నాతోబాటు ఐదుగురు బతకాలి ముగ్గురూ ఆడఎల్లలే నన్నేం చేయమంటారో చెప్పండి? ఇట్టా పొట్టకే తిప్పలుపడనా అటు ఎదిగిన ఆడఎల్లల పెళ్ళిళ్ళు చేయనా? నేనూ చూస్తావున్నానండీ ఆఖరికి ఎప్పుడో ఎచ్చెక్కుతుంది అప్పుడు - అని కత్తులను పదునెక్కిస్తున్న పండరి మనఃస్థితికి (పే 184) చేరుకోవడం జరుగుతుంది క్రైం, సెక్సు డాన్సులు ఉన్న సినిమాలు రెండేసి సార్లు కూడా చూచే (పే 156) నూకరాజులు పెరుగుతాయి

ఈ సంఘర్షణలో కొన్ని కొత్త వస్తువులు పుట్టుకొచ్చాయి భరద్వాజ ఈ వృత్తుల స్వరూపాన్ని కూడా దిఙ్మాత్రంగా ప్రదర్శించడం జరిగింది అయితే ఈ వృత్తులేవీ సుఖజీవనాన్ని తప్పకుండా యిస్తున్నవని సులభంగా చెప్పలేము లాటరీ టిక్కెట్లు అమ్మడం చెత్త కుప్పల్లో గాజుముక్కలను ఏరుకొవడం, తాళాలు బాగుచేయడం వీధుల్లో మిరపకాయ బజ్జీలు అమ్ముకోవడం, కడియాలను మెరుగు పెట్టడం పాతబట్టలకు మారుగా గిన్నెలను ఇవ్వడం మొదలైనవి ఎన్నో! వీటి స్వరూపాన్ని ప్రదర్శిస్తూ భరద్వాజ నూతన జీవన పరిస్థితులలో పది ప్రశ్నలకు (ఛాలెంజెస్) తట్టుకోవడం కొసం ఈ వృత్తులెలా ఏర్పడ్డాయో సూచించారు అయితే ఈ వృత్తులవల్ల ఎంత శాతానికి జీవనం గడపటం సాధ్యం అవుతున్నది అన్నది ప్రశ్న

అట్లాగే మాసిపోతూవున్న పూర్వ వృత్తులు కళలు కూడా ఈ గ్రంథంలో ప్రదర్శించడం జరిగింది వీర గాథా కథనం తగ్గిపోయింది శిలాశిల్పం దారుశిల్పం గతకాలపు విద్యలైపోయినవి ఎరుక చెప్పడం చిలుక జోస్యం మొదలైనవి మూఢవిశ్వాసాలయినయ్ గుడ్డెలుగులను ఆడించడం పాములను ఆడించడం అనాగరిక విషయమైంది వెదురుబట్టలు వాడటం ప్లాస్టిక్ సామానుల రాకతో అంతరించింది అట్లాగే రాతి వెండి స్టీల్ సామానుల రాకతో కుండల వాడకం తగ్గింది కళాయి పోయించడం కూడా ఇత్తడి సామానుల వాడకం తగ్గడంతో లేకుండా పోయింది సర్కస్ అరుదైన కళ అయింది గృహనిర్మాణవృత్తి ఇటుకలు తయారుచేసేవృత్తి ఇంకా ప్రాధాన్యం కోల్పోలేదు కాని మధ్యవర్తుల లాభార్జన పెరిగింది

ఇదీ ఈ సంధికాలం యొక్క స్వరూపం జీవన సమరం ఈ సంధికాలానికి అద్దం పట్టింది

మానవ సమాజ పురోగతిలో ఎప్పుడూ వ్యవస్థలు మారిపోతవి నూతనావసరాలకు అనుగుణంగా నూతన వ్యవస్థ రూపు దిద్దుకొంటుంది అయితే తొలగిపోయే వ్యవస్థ తనలోని ఉత్తమ మూల్యాలను కూడా వెంట తీసుకుపోకుండా కాపాడుకోవడం మానవజాతికర్తవ్యం అదే మానవజాతి సంస్కృతికి మూలాధారం ఈ మూల్యాలు పరం పరాయాతాలై నిత్య నూత్నలై సజీవంగా చైతన్యవంతంగా సాగిపోతూ వుంటవి

జీవనసమరం చిత్రించిన సమాజ చిత్రం వర్తమానాన్ని ప్రదర్శించేది ఈ వర్తమానంలో కూలిపోతున్న గతం ఉన్నది నిర్మితం కాబోయే భవిష్య ద్రేఖలు యింకా స్పష్టపడలేదు సంకులమైన వర్తమానం గత కాలం నుంచి భవిష్యత్తుకు తీసుకుపోవలసిన ప్రాథేయమేమిటో వ్యంజింపజేస్తూవున్నది - ఈ రచన

ఈ కాలంలో వార్తాపత్రికల అవసరాల కోసం పుట్టుకువచ్చిన ఫీచర్ అన్న రచనా ప్రక్రియలో ఈ

రచన సాగింది ఒక సంవత్సరం పాటు ప్రచురింప బడిన రచనలు ఇవి అయితే జీవితంలో వైవిధ్యం సహస్రముఖమైంది భరద్వాజకు ఉన్న దృష్టి వరి దృష్టి వుంటె ఎక్కడ చూచినా జీవన సమరం కని పిస్తుంది

భోపాల్ స్టేషన్ ప్లాట్ ఫారం మీద అద్దాలు కట్టిన అందమైన సంచులు అమ్మే వాళ్ళూ, ఢిల్లీలో ఐదు పైసలకు ఒక గ్లాసు చల్లని నీళ్ళు అమ్మే వాళ్ళూ హైదరాబాదులో లాడ్జీలు కుదిర్చి పెట్టే రిక్షా వాళ్ళూ మధుర మీనాక్షి దేవాలయం దగ్గర చెప్పులు దాచి పెట్టే, హరిద్వార్‌లో గంగా తీరాన ఆరతి కోసం పూలదీపాల దొప్పలను అమ్మేవాళ్ళూ, కేదార్ నాథ్ మార్గంలో గుర్రాల మీద యాత్రికులను గమ్య స్థానానికి చేరుస్తూ, శ్రీ సూక్త పురుష సూక్తాలు సస్వరంగా చదివే వాళ్ళూ —ఇలా ఎందరు ఎన్ని రకాలు ఎన్ని బ్రతుకు బాటలు ఎంత దుఃఖం పొంగుతూ వున్నది? ఎంత బడబాగ్ని అణగి వున్నది? ఈ హృదయాల్లో దుఃఖ మేఘాలు ఎవరైనా పలకరిస్తే చాలు కన్నీటి జల్లులను కురిపించడానికి సిద్ధంగా ఉన్నాయి

అయితే సాహిత్యం —అవ్యక్తమైన మహాశక్తికి సంకేతం అయిన ఈశ్వరుడి లాగా అనిర్వచనీయమైన జగదనుభవానికి సూక్ష్మరూపంలో వ్యక్తీకరణం నిలిపే ప్రతీక అందుకే సాహిత్యం వ్యంగ్యార్థ ప్రాభవం కలది జీవన సమరం అలాగే అవ్యక్తమైన ఈ సహస్ర సహస్ర జీవాల అనుభవాలను వ్యక్తం చేయడానికి రచయిత ఏర్పరచిన దిక్సూచి

రావూరి భరద్వాజ జీవన సమరం రచయితగా ఎన్నదగిన స్థానాన్ని సాధించు కొన్నాడు *

రీడర్ కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు

# రాగభరిత

పోతుకూచి సాంబశివరావు

నవ రాగ భరిత వసంతం
నవ జీవన సంరంభం
చిగురించిన ఆకులలా
అల్లుకొనుచు క్రొత్త ఆశలు
గత కాలము మనిషికి
మితిమీరిన అసంతృప్తి
భవిష్యద్దర్శనంకోసం
భవ్య దివ్యశక్తి నిచ్చు
కనుల చూడలేని భావి
భావ వీచికల పరిమళించు
చూత వృక్షముల కూయు
చిరత కోయిల సేద దీర్చు
విజయ ధ్వనులకు సంకేతం
విచ్చిన దుందుభి నాదాల పూరేకుల తరంగం

6 3-195 న్యూ బోయిగూడ
సికింద్రాబాద్

# షేక్స్పియర్ శేముషీ వైభవం

—పోలాప్రగడ సత్యనారాయణ

ప్రాగల్భ్యం 1593 నుండి 1600 వరకు గల ఆ ఏడెనిమిది సంవత్సరాలూ షేక్స్పియర్ సాహిత్య జీవితంలో గణనీయమైన కాలం 1588 లో ప్రారంభించిన నాటక రచన 1593 వరకు కేవలం తొలిదశగానే సాగింది ఆ దశలో ఆయన ఎన్నో నూతన రచనా ప్రయత్నాలు చెయ్యడం నాటక రచయితగా అపారమైన అనుభవాన్ని సంపాదించడం జరిగింది

1593 నాటికి షేక్స్పియర్ విశేషమైన అనుభవంతో ప్రాగల్భ్యం సంతరించుకొని రెండవ దశకి చేరుకున్నాడు తొలిదశ చివరవరకూ తనలో ఒక నిర్దిష్టమైన రూపానికి రాకుండా తపన పడుతూన్న శక్తులన్నింటినీ క్రోడీకరించుకొని చక్కని రచనానైపుణినీ ప్రత్యేకమైన శిల్పాన్నీ ఉదాత్త భావనాశబలతనీ ఈ రెండవ దశ ప్రారంభం నాటికి అలవరించుకో గలిగాడు అంతవరకూ ఆయనలోని శక్తులేవీ పరిణతి నందకపోవడమే కాదు జీవితంపట్ల ఒక నిశ్చితమైన అభిప్రాయం కూడా ఆయనకి అంతవరకూ ఏర్పడినట్లు లేదు అంతే కాదు పాత్ర చిత్రణా నైపుణీ భావనా బలం తనదైన ఒక శైలీ శిల్ప దృష్టీ, ఒడిదుడుకులులేని ప్లుతగీతి (blank verse) రచనా వైదుష్యం ఇవేవీకూడా బలపడలేదు అందుకే అప్పటివరకూ తనదైన ఒక మార్గాన్ని వేసుకోలేక పోయాడు ఇతర నాటక కర్తలన్ని అనుకరించడం ఏది మంచి మార్గమో ఏ మార్గం పట్టుపడుతుందో అని కనిపించిన ప్రతి మార్గాన్నీ అనుసరించడం-కాదని వెనుకకు మరలడం ఇలా పూర్తిగా ప్రయత్నాలతోనూ ప్రయోగాలతోనే ప్రథమదశ సాగింది

అయితే తక్కిన మూడు దశలకీ సంబంధించి బీజాలు పడినది ఈ దశలోనే ముమ్ముందు నిర్మించే మహా నాటక నిర్మాణానికి శంకుస్థాపన జరిగిందీ ఈ ప్రథమదశలోదే-

1593 నుంచీ షేక్స్పియర్ రచనల్లో మనకి కన్పించేది స్వంత గొంతూ స్వంత మార్గమూ నూతనమైన ఒక అపురూప నాటకనిర్మాణ వైచిత్రీను అప్పటికి అయిదారు సంవత్సరాలయి నాటక రచనా ప్రపంచంలోకి ప్రవేశించాడేమో విశేషమైన అనుభవం వచ్చింది ప్రపంచం పోకడ అర్థమైంది శక్తి సామర్థ్యాలు పెరిగి ఆత్మ విశ్వాసం బలపడింది దాంతో అనుకరణని విసర్జించి తనదైన ఒక బాటను ఏర్పరచ కొని ఆ బాటగుండా తన గమ్యం జేరడానికి హుటాహుటిని బయలుదేరాడు చవకబారు హాస్యాన్ని విడిచిపెట్టి దాని స్థానంలో సునిశితమైన మృదుహాస్యాన్ని తన రచనల్లో ప్రవేశపెట్టాడు ప్రహసన ప్రక్రియను వీడి ప్రమోదాత్మ ప్రక్రియని చేపట్టాడు పాత్రచిత్రణలో మరింత ప్రాగల్భ్యాన్ని చూపించసాగాడు భాష కంటె భావానికి ప్రాధాన్యత కల్పించాడు భాషాభారం తగ్గి భావ గంభీరం కాసాగింది కృతకమైన శైలీ కుంటుపడే ప్లుతగీతి రచనా పోయింది వాటి స్థానే సరసమైన శైలీ సరళమైన ఛందమూ ఏర్పడ్డాయి ఉరకలు వేసే యౌవ్వన సహజమైన ఉత్సాహ నిర్ఝరిణి సువిశాలమైన ప్రపంచానుభవ ప్రదేశాల్లోకి ప్రవేశించి మంద్ర గంభీర గమనాన్ని అలవరచుకొంది యువకుడైన షేక్స్పియర్ ప్రాగల్భ్యం వచ్చి అనుభవజ్ఞుడుగా మారాడు ఇలా వచ్చిన పరిణామం అంతా ఒక్క రోజులో వచ్చింది కాదు

కొద్దికొద్దిగా క్రమక్రమంగా వచ్చిన పరిణామం ఇది అంతెందుకు? ప్రథమదశలోని చివర నాటకమైన కామెడీ ఆఫ్ ఎర్రర్స్ కీ ద్వితీయ దశలోని మొదటి నాటకమైన 'టేమింగ్ ఆఫ్ ది ష్రూ కీ నిజానికి నిర్మాణ వైభవంలో గణనీయమైన భేదం ఏం లేదు అలాగే ద్వితీయ దశలోని మొదటి నాటకం కంటె రెండో నాటకం అంటే- టేమింగ్ ఆఫ్ ది ష్రూ కంటే టూ జంటిల్ మెన్ ఆఫ్ వెరోనా - ఎందువల్ల ఉత్కృష్టమైనదో చెప్పడం కష్టం అయితే కామెడీఆఫ్ ఎర్రర్స్ కీ పరిపూర్ణ పరిణతి నందిన మర్చెంట్ ఆఫ్ వెనీస్ ట్వెల్త్ నైట్ యాజ్ యూ లైకిట్ వంటి నాటకాలకి గల భేదన్ని మాత్రం చెప్పవచ్చు నాటక కర్తగా ఆయన ఎంత అభివృద్ధి చెందిందీ కూడా స్పష్టంగా గమనించవచ్చు- అలా అభివృద్ధి చెంది తన నాటక రచనా వైదుష్యాన్ని ప్రదర్శించడా కి షేక్స్పియర్‌కి పరిస్థితులూ అప్పట్లో అలాగే అనుకూలించాయి- అవకాశాలూ అలాగే లభించాయి

ఎర్ల్ ఆఫ్ లెస్టర్ సంస్థతో విడిపోయి లార్డ్ ఛాంబర్లీన్ సంస్థని 1594లో స్థాపించిన జేమ్స్ బర్‌బేజ్, షేక్స్పియర్ ని తన నూతన సంస్థలో వాటాదారునిగా చేర్చుకున్నాడు లార్డ్ ఛాంబర్లిన్‌కి ప్రభుత్వంలో అప్పటికే ఎంతో పలుకుబడి ఉంది అందువల్ల ఆ సంస్థకి గుర్తింపూ పలుకుబడీ గౌరవం లభించాయి తత్రాప షేక్స్పియర్‌కి కూడా ఆ గౌరవం పలుకుబడీ గుర్తింపూ అన్నీ లభించాయి దీంతో షేక్స్పియర్‌కి జీవనోపాధికోసం ప్రాకులాడవలసిన దుస్థితి తప్పింది అంతేకాదు- అప్పటికే లబ్ధప్రతిష్ఠుడు కావడంవల్ల వేరే ప్రజాదరణ కోసం పాటుపడవలసిన అవసరం కూడా లేకపోయింది దాంతో స్వేచ్ఛగా ఏదైతే చక్కని మార్గం అని తాను విశ్వసించాడో ఆ మార్గాన్ని పయనించడానికి అతనికి వీలు అయింది అంతేకాదు ఆ సమయంలో అంటే 1594-1598 మధ్య కాలంలో అతనికి దీటైన నాటకకర్తలు లేరు నాటకరంగంలో అతడే మకుటంలేని మహారాజు 1594 నాటికే విద్యావైశిష్ట్యులు (university wits) అందరూ ఒకరి వెనకాల ఒకరుగా నాటక రంగం నుంచి నిష్క్రమించారు 1598 నాటికి కాని బెన్‌జాన్‌సన్ ఆంగ్ల నాటక రంగ ప్రవేశం చెయ్యలేదు దాంతో ఈ నాలుగైదు సంవత్సరాలూ ఆంగ్ల నాటక రంగాన్ని ఏకచ్ఛత్రాధిపతిగా ఏలుకుంటూ అసంఖ్యాకమైన ప్రమోదాంత నాటకాలని (comedies) వ్రాసి తన పేరు ప్రతిష్ఠలనీ నాటకరంగంలో తన స్థానాన్నీ పటిష్ఠం చేసుకుంటూ, నిరాఘాటంగా తన నాటక రచనా సామర్థ్యాన్ని అభివృద్ధి చేసుకోసాగాడు షేక్స్పియర్

ఆ రోజుల్లో షేక్స్పియర్ పలుకుబడి అధికంగా ఉండేది అనడానికి మరో తార్కాణం ఉంది దాదాపు పాతికేళ్ళ నుండి కోట్ ఆఫ్ ఆరమ్స్ అనే గౌరవాన్ని పొందాలని అభిలషించి నిరాశ పొందిన జాన్ షేక్స్పియర్‌కి (నాటక కర్త అయిన విలియం షేక్స్పియర్ తండ్రి) ఆ గౌరవం తన పలుకుబడి నుపయోగించి 1596లో లభింపజేశాడు అధికార పత్రాలను బట్టి జాన్ షేక్స్పియర్‌కి ఈ గౌరవం 20-10-1596 వ తేదీన విలియం డెథిక్ అనే అధికారిద్వారా అందింపజేసినట్లు తెలుస్తుంది

నాటక రచయితగా రోజురోజుకీ ఉన్నత శిఖరాలు అధిరోహిస్తూ ఆనందిస్తున్నా 1596 1597 సంవత్సరాలలో షేక్స్పియర్ తన వ్యక్తిగత జీవితంలో కొన్ని ఒడిదుడుకులికి లోను అయినట్లు కనిపిస్తుంది కారణం ఏమిటో తెలియదు కాని విలియమ్ వయట్ అనే అతను షేక్స్పియర్ ఫ్రాన్సిస్ లేంగ్‌లీ డొరాథీసోర్ యాన్లీల వద్దనుండి ప్రాణహాని తల పెట్టము అని ఒక హామీ పత్రాన్ని 1596లో తీసుకున్నాడనీ అలా తీసుకున్నట్లు సాక్ష్యాధారాలు కలవనీ 1931లో వెస్లీహాట్సన్ ప్రకటించాడు ఇలా హామీ పత్రం ఇవ్వడం షేక్స్పియర్ మనస్సుకి కొంతచికాకు కలిగించి ఉండవచ్చును దీనికి తోడు, తాను భాగస్వామిగా ఉన్న చాంబర్లీన్ సంస్థ ఎదుర్కొంటున్న

క్లిష్ట పరిస్థితుల వల్ల కూడా అతనికి శాంతి లోపించింది ఆ పరిస్థితులు ఇక్కట్లు ఏమిటంటే చాంబర్లిన్ సంస్థ 1576లో తన నాటకశాలను గైల్స్ ఎలెన్ అనే అతని స్థలంలో 21 సంవత్సరాలకి ఒడంబడిక చేసుకొని నిర్మించుకొంది 1597 లో ఆ ఒడంబడిక ముగియనున్నది ఆ స్థలాన్ని తిరిగి ఆ సంస్థకి అద్దెకివ్వడానికి ఎలెన్ సమ్మతించడం లేదు ఆ మహలను థియేటరుని అక్కడినుండి ఎత్తివేయాలి ఎక్కడకు? ఇదు తీవ్రమైన సమస్య

ఇది ఇలా ఉండగా నాష్ బెన్‌జాన్‌సన్‌లు ఏంప కముల ద్వీపము (The isle of dogs) అనే నాటకాన్ని బ్రిటన్ ద్వీపాన్ని మనస్సులో పెట్టుకొని రాశారు ఆ వ్యంగ్య నాటకాన్ని పెంబ్రూక్ సంస్థవారు స్వాన్ నాటకశాలలో ప్రదర్శించారు ఆ ప్రదర్శన ప్రభుత్వంవారి ఆగ్రహానికి గురి అయింది తత్ఫలితంగా 28-7 1597 న ప్రభుత్వం ఒక ఉత్తర్వు జారీ చేయడం ఆ ఉత్తరువు ననుసరించి నగరంలో నాటకశాలన్నీ కొన్ని నెలల వరకూ మూసివేయవలసి రావడం జరిగింది

ఇవన్నీ ఇలా ఉండగా 1595లో సిడ్నీ ప్రచురించిన ఆపాలజీ ఫర్ పొయిట్రీ అను నామాంతరంగల డిఫెన్స్ ఆఫ్ పొయిజీ అనే విమర్శ సమకాలీన నాటక రచనా ప్రగతికి తీవ్రమైన విఘాతం కలిగించింది "నాటకం యొక్క పరమావధి సామాజికునకు చక్కలి గింత పెట్టడమే కాదు చక్కని హితబోధ కూడ చెయ్యాలి నాటకంతో దేశకాల సామరస్యాలు (unity of place and time) ముఖ్యం నవిషిస్తేనే కాని నాటకానందం కలుగదనుకోవడం పొరబాటు ఈ విధంగా సిడ్నీ తన విమర్శనని సాగించడంతో ప్రజా సామాన్యం యొక్క, ముఖ్యంగా సంస్కారం గల సభ్య సామాజికుల అభిరుచులు మారాయి నిజానికి యిలా అభిరుచిలో మార్పు సిడ్నీ విమర్శ వెలుగులోకి రాకముందే అంటే 580 కు ముందే ప్రారంభం అయినట్లు కనిపిస్తుంది ఈ విధంగా అభిరుచి మారిన సంస్కార సామాజికుల కొసం కొన్ని నాటక సంసలు బ్లాక్ ఫ్రైయర్స్ నాటకశాలల్లో కొన్ని ప్రత్యేక ప్రదర్శనలను ఇవ్వడం మొదలుపెట్టాయి వీటి పోటీలనుకూడా గార్డ్ చా ఒలస్‌సంస్థలవంటిసంస్థలు దుర్కొనవలసివచ్చింది

తీక్ష్ణ ప్రమోదాంతములమీదా (tragic comedies) సామరస్య త్రయం మీదా (3 unities) సిడ్నీ ఎంతటి బలమైన విమర్శనని పకటించినా షేక్స్పియర్ ఏమీ లెఖ్ఖ చెయ్యలేదు తన మార్గాన్ని విడనాడనూ లేదు సామరస త్రయం అవసరం అని కాని, అనవసరం అని కాని నోటితో అనలేదు ఏ నాటకంలోను ఉల్లేఖించలేదు ఏ సందర్భంలోనూ ప్రకటించలేదు అయితే ఆచరణలో మాత్రం ఇతివృత్త సామరస్యం (unity of plot) తప్ప తక్కిన రెండు సామరస్యాలూ (unity of time and place) నాటకంలో అవసరం లేదు అని నిరూపించాడు తాను వ్రాసిన అన్ని నాటకాల లోనూ కథా సామరస్యం (unity of plot లేక unity of action) పాటించాడు కాని దేశ కాల సామరస్యాల్ని (unity of place and unity of time) పాటించలేదు అయితే అలా పాటించి రచన చేసే సామర్థ్యం తనకి లేకపోలేదు అని నిరూపించడం కోసమా అన్నట్లు ఈ సామరస్య త్రయాన్ని తొలిరోజుల్లో వ్రాసిన కామెడీ ఆఫ్ ఎర్రర్స్ లోనూ నాటకరచనని మానివేసే రోజుల్లో వ్రాసిన సంటులీస్ టెంపెస్ట్ ల లోనూ పాటించాడు నాటక కర్త సమర్థుడైతే ఈ సూత్ర త్రయాన్ని పాటించినా పాటించక పోయినా రచనని విజయవంతముగా నిర్వహించ వచ్చునని నిర్ధారణ చేశాడు

షేక్స్పియర్‌కి 1597వ సంవత్సరం మరో కొత్త చిక్కు తెచ్చిపెట్టింది ఆయన రిఛర్డ్ II నాటకంలో సమకాలీన వ్యక్తుల యొక్క పరిస్థితుల యొక్క ప్రస్తావన ఉందని కొందరు ఆరోపించారు హెన్రీIV ఒకటవ భాగంలో వచ్చే సర్ జాన్ ఓల్డ్ కాసల్‌పాత్ర

తన పేరు ఉన్నదని అది తన కవమానకరమని చెప్పి ఓల్డ్ కాసిల్ బిరుదువహించిన లార్డ్ కాబ్‌హామ్ అభ్యంతరం చెప్పాడు అలా చెప్పడం వల్ల తన నాటకంలో పాత్ర ఓల్డ్ కాసిల్ పేరు తీసేసి ఫాల్ స్టాఫ్ అనే పేరు షేక్స్పియర్ స్వీకరించవలసి వచ్చింది

ఇలా 1597 ఒక విధంగా షేక్స్పియర్‌కి గడ్డు సంవత్సరంగా కనిపించినా అదే సంవత్సరంలో ఆయన చాలా ఎక్కువ మొత్తం చెల్లించి ఒక పెద్ద భవనాన్ని కొన్నాడు 4 5 1597వ తేదీన విలియమ్ అండర్ హిల్ దగ్గరనుంచి స్ట్రాట్‌ఫర్డ్ అన్-ఏవాన్‌లోని పెద్దమందిరమైన న్యూ ప్లేస్'ని కొనడానికి ఆయన ఒడంబడిక చేసుకున్నాడు

లార్డ్ చాంబర్లేన్ సంస్థకి 1598 మంచి లాభసాటి అయిన సంవత్సరం ఫాల్‌స్టాఫ్ పాత్ర విశేషంగా సామాజికుల్ని ఆకర్షించింది బెన్ జాన్సన్ వ్రాసిన ఎవ్విరి మాన్ ఇన్ హిజ్ హ్యూమర్ అనే నాటకాన్ని ప్రదర్శించే హక్కుని కూడా ఈ సంస్థ సంపాదించింది అది కూడా ఎంతో ప్రజాదరణ పొందింది ఇలా ఉండగా ఈ సంస్థవారు రోజ్ నాటకశాలకి సమీపాన ఉన్న స్థలాన్ని 25 12 1598న అద్దెకి తీసుకుని పీటర్ స్ట్రీట్‌తో 8 1 1599న ఒడంబడిక చేసుకుని గ్లోబ్ థియేటర్‌ని నిర్మించుకున్నారు 1600వ సంవత్సరం జూలై నెల నుండి ఈ గ్లోబ్ థియేటర్‌లోనే షేక్స్పియర్ నాటకాలన్నీ విరివిగా ప్రదర్శించారు 1613లో అగ్ని ప్రమాదానికి అది కాలిపోయేవరకూ ఆ ప్రదర్శనలు సాగాయి శీతాకాలంలోనూ ప్రత్యేక ప్రదర్శనల సందర్భంలోనూ బ్లాక్ ఫ్రైయర్స్ ఉపయోగించేవారు కాని 1600 నుండి 1613 వరకూ చాంబర్లిన్ సంస్థవారు విరివిగా వాడుకొన్నది గ్లోబ్ థియేటరే!

మొత్తం మీద 1598–1600 మధ్య గల రెండవ దశలో, షేక్స్పియర్‌లో గల నిత్య ప్రత్యగ్రమైన భావనాశక్తి, వివేక వివేచన విమర్శనాది వివిధ శక్తులతోనూ సమధికోత్సాహంతోనూ పదునై లోకాలోకనంతో శక్తిమంతమై వాస్తవికతతో ప్రాణశక్తిని పుంజుకుని ఆనంద నందనములయిన ప్రమోదాంతాలు రసజ్ఞజనమనోభిరామములయిన విహారారామాలని సృష్టించింది ఈ ద్వితీయ దశ ప్రాయికంగా వినోదపద్ధతి (ఉదా॥ కామెడి ఆఫ్ ఎర్రర్స్ రచనా మార్గం) వీడిన ప్రమోదాంతాలకీ షేక్స్పియర్ వ్యక్తిత్వాన్ని కొంతలో కొంత వ్యక్తీకరించే కవితలకీ ఆటపట్టు!

ది టేమింగ్ ఆఫ్ ది ష్రూ రెండవ దశలో వ్రాసిన ప్రథమ ప్రమోదాంతమైన టేమింగ్ ఆఫ్ ది ష్రూ కి మూలము నిర్ధారణ కాలేదు ఇంగ్లండ్‌లో మాత్రము ఈ నాటకానికి గాస్కోయిన్ యొక్క సపోజెస్ ఆధారమని అభిప్రాయపడ్డారు[1] ఈ నాటకంలో ప్రస్తావన నాటకం అనే రెండు భాగాలున్నాయి

బిదెయా చెంబుగా మాటే క్రిష్టఫర్ అనే ఓ కొంటెవాడు తప్పత్రాగి పడి ఉండగా హాస్యానికై ఆతని తమ ప్రభువని చెప్పి తీసుకొనిపోయి సమస్త రాజోపచారాలూ నిర్వర్తిస్తుంది ఒక ప్రభువుగారి పరివారం ఆ తర్వాత ఆ పరివారంలో వాళ్ళు ఒక నాటకం కూడా ప్రదర్శిస్తారు ఇది ప్రస్తావన భాగం ఇంక నాటక భాగంలో ఆ పరివారం ప్రదర్శించిన నాటకం- దాని కథ ఇదీ- "వెరోనా లోని పెట్రూషియో అనే నిశితమైన ప్రజ్ఞ కలవాడొకడు పాడువా లోని బాప్టిస్టా యొక్క పెంకి కుమార్తె అయిన కేథరినాను పెళ్ళి చేసుకోడానికి నిశ్చయిస్తాడు వివాహం రోజున విపరీతమైన ఆలశ్యం చేసి అసహ్యమైన దుస్తులు వేసుకుని పెళ్ళి తంతు పూర్తి చేసుకుని వివాహపు విందు వలదని చెప్పి ఒక కుంటి గుర్రం మీద భార్యను తీసుకుని పెట్రూషియాలో ఉన్న తన యింటికి వెళ్ళిపోతాడు అసలే అవమానంతో కుందుతూన్న కేథరినాకు తగిన ఆహారం కానీ సౌకర్యం చెనీ సమకూర్చక, ఆ వస్తువులేమీ ఆమె అంతస్థుకి తాగినవిగాలేవని దబాయించి అలగని ఆమెని నిర్లక్ష్యం తయ్యకుండా ఎంతో ప్రేమగా చూస్తూ మొత్తానికి ఆమె

1 Narrative and dramatic sources of Shakespeare - By Bullough (vol 1 1957)

పెంకెతనాన్ని పూర్తిగా వదులుస్తాడు తర్వాత ఏర్పాటయిన విందులో అక్కడికి ఎచ్చిన వారిలో ఎవరి భార్య ఎక్కువ విధేయురాలు అని ప్రశ్న వచ్చినప్పుడు పెట్రూషియో భార్య అయిన కేథరినాయే అని నిరూపితం అవుతుంది ఈ నాటకం చూసిన తరువాత, తన యింటికి వెళ్ళి తానొక చక్కని కలగన్నానసీ ఆ కలలోని పెట్రూషియోలాగె తాను కూడ తన పెంకి భార్యను లొంగదీసుకుంటానని అంటాడు క్రిష్టఫర్

క్రిష్టఫర్ వలె సామాజికులందరూ కూడా ఈ నాటకాన్ని ఒక చక్కని కలలా స్వీకరించాలని షేక్స్పియర్ అభిమతం కాబోలు! ఇది కామెడీ ఆఫ్ ఎర్రర్స్ వలె పూర్తి ప్రహసనం కాదు కేవలం వినోదభరితమైన ప్రహసనాల రచనా విధానం తన మార్గం కాదని గ్రహించి కొత్త మార్గానికి షేక్స్పియర్ మళ్ళినట్లు ఈ నాటకం కనిపిస్తుంది ఆయన వ్రాయబోతూన్న పరిణత ప్రబోధాత్మకాలకిది అపరిణత రూపం అయితే కామెడి ఆఫ్ ఎరర్స్ లోని వినోదపూరితమైన సన్నివేశాలుకూడా ఇందు కనిపిస్తాయి అంతేకాదు వ్రాయబోతున్న ప్రసిద్ధ ప్రమోదాంత విషాదాంత నాటకాలలో కనిపించే సన్నివేశాలయొక్క స్వరూపం బీజరూపంలో ఈ నాటకంలో సాక్షాత్కరిస్తుంది ఈ నాటకమందలి ప్రస్తావనలో నాటకకర్తలకి లార్డు చెప్పిన హిత వచనాలకీ నగరమందలి విషాదాంత ప్రదర్శకుల గురించి పోలోనియస్‌కి హేమ్‌లెట్ ఇచ్చిన హిత వచనాలకీ పోలికలున్నాయి ఈ నాటకం 1వ అంకం 1వ దృశ్యంలో విద్యావిషయాలపై ట్రానియో వెలిబుచ్చిన అభిప్రాయాలకీ లవ్స్ లేబర్స్ లాస్ట్ లో బెర్నీ తెల్పిన అభిప్రాయాలకీ సామ్యం ఉంది లుసెన్సియో ప్రభృతుల మోసకృత్యాలు మచ్ ఎడో ఎబౌట్ నథింగ్ లోని కృత్యాల్ని తలంపజేస్తాయి

ఇంక ది టేమింగ్ ఆఫ్ ది ష్రూ లో విశేషాలు 3వ అంకమందలి 1వ దృశ్యంలో లుసెన్సియో కేథరిన్ సోదరి అయిన బియాంకాకి చెప్పే లాటిన్ పాఠాలూ సంగీతం పాఠాలూ షేక్స్పియర్‌కి లాటిన్ సంగీతాలని బోధించే పద్ధతులపై ఎంతటి వేళాకోళంతో కూడిన అభిప్రాయం ఉందో తెలియజెప్తాయి కేథరిన్‌ని విధేయురాలిగామార్చే సన్నివేశాలు సభ్యతకి దూరంగా ఉన్నాయని కొందరి అభిప్రాయం కాని చేస్తున్నది పెంకితనం మీద యుద్ధం కనుక అలా ఉండడం ఔచిత్యమే అని చార్లటన్ వంటి వారి అభిప్రాయం [1]

నాటకం మొదట్లో కేథరిన్‌ను గర్హించిన యువకులే చివరి అంకం వచ్చేసరికి తమ తమ భార్యలు కూడా ఆమెలా ఉంటే ఎంత బాగుండును! అని అనుకోవడం వల్ల నాటకానికి చక్కటి మలుపు ఏర్పడింది ఆ పాత్ర చివరికి ఎటువంటి పరిణామం చెందిందీ కూడా మనకి అవగతం అయింది మొదట్లో మాటకి మాట, జవాబు చెప్పే కేథరిన్ చివరికి పెంకితనం తగ్గి

Thy husband is thy lord thy life
thy keeper thy head, thy sovereign

అంటూ మాట్లాడడం ఎంతో విశేషం స్త్రీ బలం అంతా ఆమె బలహీనత యందే యున్నది అనే విషయం ఈ నాటకలో స్పష్టం [2]

మూర్ఖత నుండి విభేదం విభేదం కారణంగా ఘోరమైన ఆలోచనలు పుడతాయి మూర్ఖత వలన ఏర్పడే పరిస్థితుల్ని ప్రమోదాంతాలలోనూ ఘోరమైన ఆలోచనల ఫలితంగా జనించే దుర్ఘటమైన సంఘటనల్ని విషాదాంతాలలోనూ అభివర్ణించడం షేక్స్పియర్ మార్గంలా కనిపిస్తుందని డుథే అనే విమర్శకుడు తను వ్రాసిన షేక్స్పియర్ అనే గ్రంథంలో ఉదహరించాడు

ఈ దృష్ట్యా చూస్తే కేథరిన్ మూర్ఖత వలన ఏర్పడిన పరిస్థితులే టేమింగ్ ఆఫ్ ది ష్రూలో వర్ణితమైన సంఘటనలు

1 Vide Charlton s Shakespearian comedy

2 ఈ మాట Browne తన Shakespeare and his comedies అనే గ్రంథంలో అన్నాడు

ఈ నాటకం కేవలం కుర్రతనంగా వ్రాసిందని కొందరూ కాదు సుస్థిరమైన వ్యవస్థను కూలదోయడానికి ప్రయత్నించే పాత్రలూ వారి కథా ఎలా ఉంటుందో చూపించే తీవ్రమైన ఆలోచనతోనే షేక్స్పియర్ కేథరిన్ పాత్రని ఈ నాటకంలో సృష్టించాడని తర్వాత రాయబోయే మేక్‌బెత్ లేడీమేక్‌బెత్ పాత్రకి ఈమె నాంది వంటిదని కొందరూ పరస్పర విరుద్ధమైన అభిప్రాయాలు వెలిబుచ్చారు

కాని షేక్స్పియర్ ప్రపంచము నైపుణి అనే తన గ్రంథంలో శ్రీ కె ఎస్ శ్రీనివాస అయ్యంగారు బాహ్యంగా కన్పించే మార్పులూ పూర్ణంగా వర్ణించడం అవి ఈ నాటకం నుండి షేక్స్పియర్ పాత్రల యొక్క అంతరమైన మార్పులనీ ఆ మార్పులు రావడానికి పరిస్థితులు చేసే సహాయాన్నీ వర్ణించడం మొదలుపెట్టాడు వివేకాన్నీ ప్రపంచానుభవాన్నీ పెంపొందించుకొని తన అపరిణత దశ నుండి పరిపక్వత చెందిన దశ వైపు కేథరిన్ పయనించడం ఈ నాటకంలోని ముఖ్యమైన సంగతి ఈ దృష్ట్యా టేమింగ్ ఆఫ్ ది ష్రూని పరిశీలించాలి అన్నారు ఏమైనా రెండవది అయిన ప్రాగల్భ్య దశలోనికి ప్రవేశించిన షేక్స్పియర్ పరిణత చెందిన నాటక రచనా విధానంవైపు పయనించడానికి ఉద్యుక్తుడైనట్లు ఈ నాటకం ఇందలి రచనామార్గం చెప్తాయి తత్త్వాం ప్రాగల్భ్య దశకి ఈ నాటకం సింహద్వారం— *

6 మున్సిపల్ స్ట్రీట్ బాపట్ల 522 101

# దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్ర, మద్రాసు-17

## పరీక్షా విభాగము

1983 ఫిబ్రవరి హిందీ పరీక్షలలో ఐచ్ఛిక ప్రశ్నలు

1983 ఫిబ్రవరిలో జరుగు సభ ప్రారంభిక మరియు ఉన్నత పరీక్షలలో 1982 సెప్టెంబర్ ప్రారంభిక ఉన్నత పరీక్షల పాఠ్య పుస్తకముల నుండి వైకల్పిక ప్రశ్నలు ఇవ్వబడును ఈ సౌకర్యము కేవలం 1983 ఫిబ్రవరి పరీక్షలకు మాత్రమే వర్తించును

పరీక్షా దరఖాస్తు ఫారము ధరలలో మార్పులు

| | |
|---|---|
| ఉన్నత పరీక్షల దరఖాస్తు ఫారం 1 కి | 1—50 |
| ప్రారంభిక పరీక్షల దరఖాస్తు ఫారం 1 కి | 1—00 |
| ఛూట్ మరియు ఇతర ఫారాలు | 1—00 |
| ప్రమాణిత ప్రచారక్ ఫారం ధర | 1—00 |
| మార్కులు లెక్కింపునకు (అంక్ గిన్‌తీ) ప్రతి పేపరునకు | 5—00 |
| కాన్వకేషన్‌కు హాజరై ఉపాధి పత్రము పొందుటకు (శాలువతో) | 40—00 |
| కాన్వకేషన్‌కు హాజరు కాకుండా ఉపాధిపత్రం పొందుటకు రిజిస్ట్రేషన్ ఖర్చుతో (శాలువ ఇవ్వబడదు) | 84—00 |

**వే రాధాకృష్ణమూర్తి**
*ప్రధాన కార్యదర్శి*

జ మార్గబంధు
పరీక్షా సచివ్

# తెలుగు నవల - సాహిత్యపు విలువలు

— రఘువర్మ

## నవల

నవలా సాహిత్యపు విలువల గురించి చర్చించుకునే ముందు నవల యొక్క రూపాన్ని ఛాయామాత్రంగా నైనా చూడటం సముచితం!

Novel అనే ఇంగ్లీషు పదానికి ఆంధ్రీకరణం నవల. ఇది సాహిత్య ప్రక్రియ అయితే ఈ ప్రక్రియకు మొట్టమొదట్లో నవల అనే పేరు చెలామణిలో లేదు. దీనికి ఈ పేరు పెట్టినది - శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు. వారు క్రీ. శ. 1897లో కందుకూరి వీరేశలింగం పంతులు గారి రాజశేఖర చరిత్రము పై వ్రాసిన విమర్శన గ్రంథపు పీఠికలో "ఆంగ్లేయ భాషలో నోవెల్ అను పదము క్రొత్త అను నర్థము గల నవ్ అను పదము నుండి పుట్టినది. ఈ నవ్ అను దానికి నవ యను సంస్కృత పదంబునకు గల సంబంధము లెస్సతెల్లము. కావున నవలా — అనగా క్రొత్త విశేషములు గలదని యర్థము వచ్చుచున్నది. మహారాష్ట్ర భాష యందును ఈ మాటకిదే యర్థమగుట చేత వేరొక పదమునకై ప్రయత్నము చేయక నవల యని ఈ పదమునే ఇట వాడుచున్నాను" అని వ్రాస్తూ నవల పేరునే ఖాయం చేశారు. ఇంతకు ముందు ఈ ప్రక్రియలో సాగిన రచనను నవీన ప్రబంధము అనియూ వచన ప్రబంధము అనియూ పిలిచేవారు.

తెలుగులో మొట్టమొదటి నవల సంస్కృతాంగ్ల సాహిత్యాల ప్రత్యక్ష ప్రభావం లేకుండానే క్రీ. శ. 1872లో ఆవిర్భవించినది. అది శ్రీ రంగరాజ చరిత్రము. దీని కర్త శ్రీ నరహరి గోపాలకృష్ణమ చెట్టిగారు. (తొలి తెలుగు నవల విషయమై "మహాశ్వేత", శ్రీ రంగరాజ చరిత్రము, రాజశేఖర చరిత్రము - ఈ మూడింటి మధ్యా వాదోపవాదములున్నాయి. చివరకు శ్రీ రంగరాజ చరిత్రమే తొలి తెలుగు నవలగా ఎంచబడినది.)

ఆటు తరువాత అంటే క్రీ. శ. 1900 తరువాత తెలుగు నవల అనుకరణలతో అనుసరణలలో నడకలు నేర్చుకున్నది. ఆటు పిమ్మట అంటే క్రీ. శ. 1920 తరువాత తనకు తాను నిలబడటం నేర్చుకున్నది.

ఇక 1940 తరువాతే ప్రౌఢిమను సంతరించుకొని కొంగ్రొత్త ఒయ్యారాలు ఒలకబోస్తూ క్రొత్త పోకడలు పోయింది. ఈ మధ్య అంటే 1970 తరువాత - డ్రైనేజీ లో పడిపోయింది — తెలుగు నవల గమ్యం తెలియండా!

ఇదీ - తెలుగు నవలా యోషామణి ఛాయామాత్ర రూపం!

## నవలా సాహిత్యపు విలువలు

దేనికైనా విలువను బట్టి ప్రయోజనం ఏర్పడుతుంది. ప్రయోజనాన్ని బట్టి విలువ ఉంటుంది.

గొప్ప నవలకే సాహిత్యపు విలువలుంటాయి. ఆ విలువలు - ఆ నవలల్లో ఉన్న ఇతివృత్తాన్ని బట్టి శిల్పాన్ని బట్టి భాషను బట్టి ఏర్పడతాయి.

సృజనాత్మక కృతికు ముడిసరకు ఏ టిది ఇతివృత్తం!

తాను చెప్పే విషయాలు పొల్లుపోకుండా పాఠకుల హృదయాల్లో అతి వేగంగా నాటుకుపోవడానికి రచయిత(త్రి) వాడే టెక్నిక్' శిల్పం!

రచయిత్రులుగా మారి నవలలు వ్రాస్తూన్న రచయితలు కూడా ఉన్నారు కొందరు రచయిత(త్రు)లు కథ వ్రాయడం మొదలుపెట్టి - ఛ కథ రాస్తే ఏమొస్తుంది బోడి నవల రాసినా డబ్బు దండిగా వస్తుంది గదా — అని ఆ కథనే నవలగా పెంచి వ్రాస్తున్నారు

మాయలతో మంత్రాలతో భయాన్ని పుట్టించే నవలలే చాలా గొప్ప నవలలుగా చెలామణి అయిపోతున్నాయి ఈ మధ్య

డబ్బుకోసం ఏదైనా ఏమైనా వ్రాయడానికి వను కాడడంలేదు నేటి రచయిత(త్రు)లు మరి పత్రికలు వేసుకోడానికి సిద్ధంగా ఉన్నాయాయె వెర్రి గొర్రెల్లాంటి జనాలు వేలం వెర్రిగా చదువుతున్నారాయె ఇక వాళ్ళు రాయక ఎం చేస్తారు పాపం!

చదివేవాళ్ళకందరికీ ఆలోచన లేదనను ఆలోచన ఉన్నవాడు- మంచి నవలలు వచ్చినప్పుడే చదువుతాడు రానప్పుడు మానేస్తాడు

అసలు రాసేవాళ్ళే - తామేం వ్రాస్తున్నారు ఎందుకు వ్రాస్తున్నారు? వాటివల్ల ప్రయోజనం ఏమైనా ఉందా?- అని ఆత్మవిమర్శ చేసుకోవాలి చేసుకొని ఇదివరకు చెత్త నవలలు వ్రాసినా ఇకముందైనా చిత్తశుద్ధితో సాహిత్యపు విలువలున్న సత్తాగల నవలలు వ్రాయాలి!

నా నవలలో సామాజిక దృక్పథం ఉందియ్యా అంటాడొక రచయిత

నేను సామాన్యులకర్థం కావాలని వ్యావహారిక భాషలో నా నవలని వ్రాశానయ్యా అంటాడు ఇంకో రచయిత

వీళ్ళకి నే చెప్పేదేమిటంటే సమాజానికున్న రెండు ప్రక్కల్లో ఒకటే ప్రక్కను చిత్రిస్తే అది సామాజిక దృక్పథం అవదు ఒక వ్యక్తి బాహ్యరూపం చూసినంత మాత్రాన అతడి అంతరరూపం అర్థం కాదు కదా!

ఇహ వ్యావహారిక భాషలో వ్రాసినంత మాత్రాన అది అభ్యుదయ నవల అయిపోదు భాషపైనే దృష్టి పెట్టి - ఇటు ఇతివృత్తాన్నీ అటు శిల్పాన్నీ నిర్లక్ష్యం చేయడం - అదీ నవలకు గొడ్డలిపెట్టే అవుతుంది అతి ఛాందసంతో జుట్టు పీక్కున్నట్టూ అవుతుంది! భాష కృత్రిమంగా ఉందని చదివే పాఠకుడు తొందరగా పట్టేస్తాడు ఇదంతా ఏదో గారడి లాగా కన్పడుతుందతనికి

అసలు రచయిత ఇతివృత్తాన్ని గురించే ఆలోచించాలి కానీ శిల్పం భాష గురించి కాదు శిల్పం భాష ఉన్నదున్నట్లుగా సహజంగా వెర్రివేషాలూ మారువేషాలూ వేసుకోకుండా రాసేవాడి గుండెల్లోంచి అతడి కలంలోకి - రావాలి !

సామాన్యుల కర్థమయ్యేలా చెప్పడానికి తెలిసిన వాళ ఎప్పుడైనా ఉంటారు (అజ్ఞుల్ని విజ్ఞులుగా చేస్తేనే గదా విజ్ఞతకు సార్థకత !)

**నవల లెలా ఉండాలి ?**

Novel is a Summary of actual life - అని నవల గురించి - మెరిడీత్ నిర్వచనం

ఇక మొపాసా నిర్వచనమేమో ఇది- నవలా రచయిత ధ్యేయం కథ చెప్పడం గానీ మనల్ని ఆనందపరవశుల్ని చేయడం గానీ కానే కాదు అజ్ఞాతంగా దాగి ఉన్న సంఘటనల ప్రాధాన్యతను మనం అర్థం చేసుకొని ఆలోచించేట్టు అతను చేయగలగాలి "

(ఇదంతా ... కాదు ... విధంగా ఉండాలని ...షించడం కాదు ఆ విధంగా ఉ... కూడదు అని శాసించడమూ కాదు ఇదంతా మంచి నవలలు రావడం లేదే అని బాధ పడటం )

## విలువల నవలలు

విలువల నవలల గురించి నాకు తోచిన నాలుగు మాటలు

1 నవలలు చదివే పాఠకుడికి ఎంతో కొంత క్రొత్తదనాన్ని అందించ గలగాలి ఏదో కొంత మిగల్చగలగాలి పాఠకున్ని పరిణతుణ్ణిగా చేయాలి

2 నవల చదివిన తర్వాత పాఠకుడు తన గుండెల్లో ముసురుకున్న చీకట్లలో ఒక దీపం వెలిగించుకున్నట్లు సంతోషపడాలి

3 నవలా సాహిత్యంలో ఇదివరకు వచ్చిన పద్ధతుల్లో నాకు చాలా చాలా నచ్చినది మనోవిశ్లేషణ పద్ధతి ఈ పద్ధతి ద్వారానే మనిషి లోపలి లోలోపలి భావాలు నగ్నంగా వెలికివస్తాయి అప్పుడే మనిషిలోని ద్వంద్వవైఖరి ప్రస్ఫుటమౌతుంది అందుకే నవలలన్నీ ఈపద్ధతిలోనే రావాలి దీన్నే తిలక్ శైలిలో చెప్పు కోవాలంటే

నవల - అంతరాంతర జ్యోతిస్సీమల్ని బహిర్గతం చేయాలి'

విస్తరించాలి చైతన్య పరిధి !
అగ్ని జల్లినా అమృతం కురిసినా
నవత - మానవత - దాని పరమావధి

4 నవలా - అంటె అచ్చ తెలుగులో స్త్రీ ! ఘనవిజయాల్ని సాధించిన ప్రతి పురుషుడి వెనుక ఒక నవల ఉంటుందంటారు అట్లాగే ఒక గొప్ప జీవితం వెనుక ఒక నవల ఉండాలని నా కోరిక !


ఉపయుక్త గ్రంథాలు

1 తెలుగు నవల - నూరు సంవత్సరాలు"
(సాహిత్య అకాడమీ)

2 తెలుగు నవలా వికాసము
(మొదలి నాగభూషణశర్మ గారు)


రూమ్ నెం 37 న హాస్టల్ ఉస్మానియా యూనివర్సిటీ క్యాంపస్
హైదరాబాదు-500 007

# पी एच डी परीक्षा फल

## उच्च शिक्षा और शोध सस्थान
## दक्षिण भारत हिन्दी प्रचार सभा

उच्च शिक्षा और शोध सस्थान, दक्षिण भारत हिदी प्रचार सभा की पी एच डी उपाधि परीक्षा मे निम्नलिखित शोधार्थी उत्तीण हुए हैं

| शोधार्थी का नाम | | विषय |
|---|---|---|
| श्री राजेश कुमार जन | — | दिनकर की काव्य चेतना के विविध आयाम |
| श्री जी सुब्रह्मण्यम | — | डा रागेय राघव के उपन्यासो मे युवक समाजवादी चेतना |
| श्री आर एम श्रीनिवासन | — | शिवानी के उपन्यास एक समीक्षात्मक अध्ययन |

कुलसचिव

# సాహిత్యగోష్ఠి

## అస్తిత్వవాదం

నవలేఖన ప్రక్రియలో సాహిత్యగతమైన ఆధునికతను అర్థం చేసుకోవాలంటే అస్తిత్వవాదాన్ని అర్థం చేసుకోవడం ఎంతో అవసరంగా ఈనాడు కన్పిస్తున్నది ఈ అస్తిత్వవాదమనేది పరంపరాగతంగా పాశ్చాత్య దేశాలలో వ్యాప్తిలో వున్న దర్శనశాస్త్రాలకు ప్రతిక్రియగా ఏర్పడిందని చెప్పవచ్చును హెగెల్ ప్రతిపాదించిన వస్తునిష్ఠ చింతనలో ప్రభవించిన సార్వభౌమిక ప్రత్యయానికి (Univarsel Idea) ప్రతిక్రియగా ఆత్మనిష్ఠ చింతన ఏర్పడడం దానిని అందరూ స్వీకరించడం జరిగింది

అస్తిత్వవాదానికి సంబంధించిన చింతనా విధానంలో రెండు రూపాలు కనబడుతున్నవి ఒకటి ఈశ్వరవాది విధానం రెండోది నిరీశ్వరవాది విధానం పాస్కల్ కిర్కేగార్డ్ మార్సెల్ యాస్పర్స్ మొదలైనవారు మొదటి దానికి ప్రతినిధులు సార్త్రి కామూ హెడ్ గర్ మొదలైన వారు రెండోదానికి ప్రతినిధులు ఈశ్వరవాదులు ఈశ్వరుని ఉనికినీ శక్తినీ అంగీకరించినా వ్యక్తి అస్తిత్వానికి ఈశ్వరుడు కారణమనే దానిని అంగీకరించరు నిరీశ్వరవాదులు మనుష్యుడు తనకు తానే కర్త అనీ మానవేతర శక్తి ఏదీ అతని అస్తిత్వానికి కారణభూతం కాదనీ విశ్వసిస్తారు ఏమైనా రెండు విధానాల వారూ మనుష్యుడే తన అస్తిత్వానికి తాను కారణమనీ ఇతరశక్తి ఏదీ అతని అస్తిత్వానికి కారణం కాదనీ మనుష్యుడు తానే కర్త అనీ అంగీకరిస్తారు

అస్తిత్వవాద అస్తిత్వ (Existence) సారానికి (Essence) కు పూర్వవర్తిగా వుంటుందని నమ్ముతున్నది అంటే వ్యక్తి వస్తుగత వ్యక్తిగత శక్తుల సంఘర్షణ రూపంలో జన్మిస్తున్నాడని తాత్పర్యమవుతుంది ఆ తరువాత వ్యక్తి తన పనుల ద్వారా సార్థకతను సంపాదించుకొంటాడు ఇది అస్తిత్వవాదం తాలూకు ప్రధాన సిద్ధాంతం హెగెల్ ఆలోచనా విధానానికి ఇది అనుకూలం కాదు మనుష్యులు పశువులు నక్షత్రాలు మొదలైనవాటి ద్వారా దృశ్యమానమైన ప్రపంచ అస్తిత్వమయమైనదనీ తార్కికుని వాదం వలే గణిత శాస్త్రజ్ఞుని అంకెల వలే సూక్ష్మమైన వాటికి అస్తిత్వం లేదనీ హెగెల్ అంటారు వాటికి భావరూపం ఉన్నా అస్తిత్వం లేదు వ్యావహారికంగా ఉపయోగంలో వుండడం వలన అది వాస్తవమైనది కావచ్చును కాని మనుష్యులు పశువుల వలె వాటికి స్వతంత్రమైన అస్తిత్వం లేదు అంటే భావరూపంలో ఉన్నా వాస్తవికమైనవైనా సూక్ష్మరూపంలో వున్న వాటికి అస్తిత్వం లేదు ఉదాహరణకు ఎరుపు కోమలత్వము పరివర్తనశీలత మొదలైనవానిని చూడండి అవన్నీ సార్వకాలికమైన వాస్తవికతలే కాని వాటికి స్వతంత్రమైన అస్తిత్వం లేదు ఇవన్నీ కలిసి ఒక విశేష వస్తువు- గులాబీపువ్వు రూపాన్ని ధరిస్తే ఆ వస్తువు పువ్వు అస్తిత్వం కలదవుతుంది ఇది హెగెల్ వాదం హెగెల్ అభిప్రాయం ప్రకారం ఆలోచనల తాలూకు వ్యవస్థిత క్రమరూపమే ఈ విశ్వం ఈ అభిప్రాయాన్ని అస్తిత్వవాదులు అంగీకరించరు భావాలు పూర్వవస్తువులుగా వుండి వాటి వలన వస్తువులు రూపధారణ చేస్తున్నవనే వాదనను వారు అంగీకరించరు అస్తిత్వవాదులు వస్తువు (Abject) వ్యక్తి (Subject) అనే వర్గీకరణకు గూడా వ్యతిరేకులు వస్తువు వ్యక్తి రెండింటి ఐక్యతను వారు అంగీకరిస్తున్నారు ఆ ఐక్యతే అస్తిత్వాన్ని ధరిస్తున్న

దని వాదిస్తున్నారు మనుష్యుల్లో స్థూల గానూ సూక్ష్మ గానూ అంతర్నిహితమై వున్న శక్తి సంకల్పశక్తి ద్వారా వివృతమై సార్థకతను సంపాదించుకుంటుంది అదే అస్తిత్వం దాని ప్రకారం అస్తిత్వమే Esence సారం గూడా అస్తిత్వమూ సారమూ రెండిటి ఐక్యత ద్వారానే ఈ వర్తమాన పరిదృశ్యాన్నంతా అర్థం చేసుకొనవచ్చును ఇది అస్తిత్వవాద సిద్ధాంతం

సార్త్రె ఈ ఆలోచనా విధానానికే చెందినవాడైనా కొద్ది మార్పును అభిలషిస్తున్నాడు పనులలో అభిరుచులలో వ్యక్తి స్వతంత్రుడే అది సత్యమే అయినా అతని వ్యక్తిగతమైన పనులు అభిరుచులు అన్నీ సమాజానికి ఉపయోగపడవలెనంటాడు సార్త్రె అంటే వ్యక్తి తాలూకు వ్యక్తిగతమైన అభిరుచులూ పనులూ సామాజిక హితమనే బాధ్యతను గుర్తించి రూపొందవలెనంటాడు సార్త్రె మతం నైతిక విలువలు మొదలైనవాటి విషయంలో వ్యక్తి తన వివేకం మీద ఆధారపడతాడు మనుష్యుని అదృష్టం అతని శక్తి అతని అస్తిత్వం అన్నీ అతని మీదనే ఆధారపడి వుంటవి అతడు ఏ శక్తి చేతిలోనూ కీలుబొమ్మ కాడు తానే కర్త తానే భోక్త

ఇదే విషయాన్ని ఇంకొక రూపంలో గూడా ఆలోచించవలసి వున్నది మనుష్యుడు తనకు తానే కర్తా భాగ్య విధాతా అయినా బయటి పరిస్థితులతో సంఘర్షిస్తూ ఆ సంఘర్షణలో ఒక్కొక్కసారి పరాజితుడవుతున్నాడు అందువల్ల భయం నిరాశ అదృష్టవాదం భోగవాదం వంటి వాటికి లోనవుతున్నాడు సార్త్రె సృష్టించిన పాత్రల్లో సంత్రస్తులు పీడితులు కుంఠాగ్రస్తులు ప్రముఖంగా వున్నారు ఆ పాత్రలలో కొంత అంతర్విరోధం గూడా కనబడుతున్నది పాత్రలు ఆశావాదతో దృఢమైనవిగా కనబడడం లేదు ఈనాడు భారతదేశంలో వివిధ భాషల్లో సృజింపబడుతున్న సాహిత్యంలో సంత్రస్తులూ పీడితులూ కుంఠాగ్రస్తులూ మృత్యువాదులూ ఎక్కువగా కన్పిస్తున్నారు ఆ కారణం వలన కొందరు ఆ సాహిత్యాన్ని నిరాకరిస్తున్నారు అస్తిత్వ వాద రచనలు వ్యక్తి దౌర్బల్యాన్నీ విషయ లాలసత్వాన్నీ కుంఠాగ్రస్తతనూ వ్యక్తం చేస్తున్నవే గాని మానవుని ఉదాత్తతను వ్యక్తం చేయడం లేదని వారి అభిప్రాయం

ఏమైనా అస్తిత్వవాదం సాహిత్య నిర్మాణంలో వ్యక్తి విశేషమైన చింతనను వ్యక్తీకరిస్తున్నదనేది నిర్వివాదాంశం అస్తిత్వవాద సౌందర్యదృష్టితో చూస్తే అస్తిత్వాత్మకమైన ఉద్భాసం (Extencial Illumination) తర్కాతీత వ్యక్తిగతానుభూతి వ్యక్తీకరణా అస్తిత్వవాద రచనల్లో మిక్కుటంగా కనబడుతున్నవి అందువల్లనే ఆ వాదం నవ్య సాహిత్యంలో ఆధునికతా దృష్టితో- ప్రముఖస్థానాన్ని వహిస్తున్నది పైపై తాత్విక విమర్శ ఎట్లా వున్నా ఆత్మగత చింతన ద్వారా వ్యక్తి యొక్క అంతరికానుభూతుల వ్యక్తీకరణా చిత్రణా అస్తిత్వవాదపు రచనల్లో మనం చూస్తున్నాము ఆ రచనల్ని చదివి ఆనందించడానికి అస్తిత్వవాదానికి సంబంధించిన తాత్విక చింతనను ఆకళింపు చేసుకోవడం కొంత అవసరం ఈ వాదాన్ని గురించి విపులంగా చర్చించడానికి ముందు ముందు కొంత ప్రయత్నం చేస్తాను

వే. ఆంజనేయ శర్మ
రిజిష్ట్రారు
ఏ. జి. కాంప్లెక్సు
హైదరాబాద్

***     ***     ***

# ప్రతీకవాదం – ఆధునిక తెలుగు కవిత

ఆధునిక యుగంలో కళా విషయికంగా జనించిన వివిధ వాదాల్లో ప్రతీకవాదమొకటి సింబల్ అనగా చిహ్నం లేక గుర్తు దీనినే సంకేతం లేక ప్రతీక అని కూడ చెప్పవచ్చు ఇంగ్లీషులోని సింబలిజమ్ ను తెలుగులో ప్రతీకవాదము అని వ్యవహరిస్తున్నారు బాహ్యప్రపంచ భావచ్ఛాయల్ని కవి తన మనఃప్రపంచ లోకీ పరివర్తింపజేసుకొని ప్రయోగాలు జరిపి ఫలితాల్ని తిరిగి ఈ ప్రపంచానికి చెప్పాలనే ప్రతీకలే

అందుకు ఉపకరణాలు పాశ్చాత్య సాహితీప్రపంచంలో వెలువడ్డ యీ ప్రతీకవాదం శబ్దానికి భావప్రకటన కాక సూచనయే ప్రధానమని వాతావరణ కల్పనమే కళల ప్రధాన లక్షణమని భావించింది జీవితం నుంచి గాని ప్రకృతి నుంచి గాని ఒక ప్రతీకను ప్రయోగించే కవి దానికో అర్థాన్ని సంకేతిస్తాడు ఆ ప్రతీక దాని అర్థం కొంత స్పష్టంగా వుండడం అవసరం అగోచరమూ మేథాతీతమూ అయిన ఒకానొక తాత్త్విక సత్యాన్ని పాఠకుడి మనస్సుకు స్ఫురింపజేయడం ప్రతీకవాద లక్ష్యం ప్రయోగతత్పరత దానికి భూమిక వాస్తవికత నధిగమించి భావప్రపంచంలోకి చొచ్చుకొని పోవడానికి చేసే ప్రయత్నమే ప్రతీకవాదమని సింబాలిజమ్ అనే గ్రంథంలో ఛార్లెస్ ఛాడ్విక్ పేర్కొన్నాడు మానవుడు కాంక్షించే అప్రాకృత సమగ్ర భావప్రపంచమే ప్రతీకవాదమని ప్లేటో భావించాడు పంచతంత్రంలో పశుపక్ష్యాదులు పాత్రలు అవి మానవుల స్వభావానికి ప్రతీకలు వస్తు వ్యాఖ్యానం చేయడం వస్తువును లేక విషయాన్ని అంగీకార యోగ్యం చేయడం ప్రతీకల ముఖ్య ప్రయోజనమని భావించవచ్చు అన్యాపదేశంగా చెప్పన వాక్యాల్లో గూడా ప్రతీకలు ఉపయుక్తమౌతుంటాయి విరాటపర్వంలోని–

వలలుం డెక్కడ జూచె నొండెడన
సేవ్యక్ష్మాజముల్ పుట్టవే
గల యీ భూజము వంట
కట్టియలకై ఖండింపగా నేటికిన్

అనే పద్యంలో అజ్ఞాతవాసంలో వున్న పాండవులకు ఆశ్రయమిచ్చి రక్షిస్తున్న విరటుడికి వృక్షం ప్రతీక కీచక పరాభూతయై ద్రౌపది ఈ విరటుడి సభకు వచ్చినపుడు భీముడు విరటుణ్ణి గూడా శిక్షించ నెంచి సమీపంలో వున్న ఉన్నత వృక్షాన్ని వీక్షిస్తుండగా ధర్మరాజు భీమసేనుణ్ణి వారిస్తూ అన్యాపదేశంగా యీ మాటలు చెప్తాడు

1886 వ సం॥ సెప్టెంబర్ 18 వ తేదిన జీన్ మోరియస్ ఫిగారో అనే పత్రికలో ప్రతీకవాద ప్రకాశన పత్రాన్ని (సింబాలిజమ్ మేనిఫెస్టో) ప్రకటించాడు కవిత్వంలో కాల్పనికోద్యమానికి కాలం నడలిందని సాహితీ ప్రపంచ సూక్ష్మమైన కళారూపం కోసం ఎదురు చూస్తోందనీ మోరియస్ పేర్కొన్నాడు ఈయన సింబలిస్ట్ స్కూల్ అను పేర కవి సంఘాన్ని గూడా స్థాపించాడు ఈ ప్రతీకవాదానికి బాదలేర్ వెర్‌లెయిన్ రాంబో మల్లార్మే అనే నలుగురు కవులు ఆద్యులుగా భావించవచ్చు ఇంగ్లీషు కవుల్లో ఎజ్రాపౌండు టి ఇ హ్యూమ్ టి ఎస్ ఇలియట్ డబ్ల్యు బి ఈట్స్ కవులు ప్రతీకవాదులుగ పరిగణింపబడుతున్నారు

ఫ్రెంచి ఇంగ్లీషు కవితా రంగాల్లోని అనేక విచిత్ర ధోరణులు తెలుగు కవిత్వంలో చోటు చేసుకున్నట్టే ప్రతీకవాదం కూడా తెలుగు నేలలో పాదం మోపింది ప్రథమ ప్రపంచ సంగ్రామం ఫలితంగా యూరోపియన్ సమాజంలో ఏర్పడ్డ నిరాశా నిస్పృహల్ని అరాజకత్వాన్ని కవితా వస్తువుగా స్వీకరించి ఇలియట్ సృష్టించిన వేస్ట్‌లాండ్ (Wasteland) విచిత్రమైన ప్రతీకలకు నెలవై తెలుగులోని నవ్యకవులపై ముఖ్యంగా ఆరుద్ర బైరాగి వంటి వచన కవులపై ప్రభావాన్ని చూపింది కాల్పనిక కవుల్లో ప్రతీకల్ని తమ కవితల్లో ప్రయోగించినవారు బహు తక్కువ జాషువా గారి గబ్బిల కావ్యాన్ని ప్రతీకాత్మక కవితకు ఎత్తిన పతాకగా కొందరు భావించారు రాయప్రోలు వారి చిల్క అనే గేయంలోని చిలుక దేశికవితా రీతికి ప్రతీకగా భావించవచ్చు వీరి యాత్ర లోని పొంగి పొరలు నది గనుగొని కృంగిపోవగనేటికో యిటు అనే గేయంలోని సాయం సంధ్య జీవిత చరమకాలానికి నదీప్రవాహం మృత్యువుకు అంధకారం అజ్ఞానానికి నావికుడు గురువుకు నావ బోధనకు యాత్రికులు జీవులకు ప్రతీకలని విమర్శకులు అభిప్రాయపడ్డారు దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు కూడా ఒకటి రెండు కావ్య ఖండికలో ప్రతీకలు ప్రయోగించినా వాటికి ప్రయోజనం గాని ప్రాధాన్యం గాని లేదు

ప్రతీకల్ని పూర్తిగా ఆధునికత తొణికిసలాడే లాగ ప్రయోగించిన కవి శ్రీశ్రీ ఒక మానసిక దశ ఒక ప్రకృతిదృశ్యం ఒక సంఘటన ఒక వ్యక్తిరూపం– వీటన్నిటినీ వివరించడానికి ఆయన ప్రతీకలు వాడారు బహుళ పంచమి జ్యోత్స్న ఆరిన కుంపటి

యమునిమహిగవు లోహఘ ఓలు జగన్నాథ రథ చక్రాలు శ్రీశ్రీ ప్రయోగించిన ప్రతీకలుగా ఉదాహరించవచ్చు శ్రీశ్రీ తరువాత ఆధునిక గా ఎమకాలీన స ఘటనలకి ప్రతీకల ద్వారా వ్యాఖ్యానం చెప్పిన కవి ఆరుద్ర త్వమేవాహం ఎనీవాలి లలో ఇలియట్ ప్రభావ స్పష్టంగా కన్పిస్తు ది కాని ఆరుద్ర ఇలియట్ ప్రతీకవాదం లోని చమత్కృతు లన ఆకళి పు చేసుకున్నా ఆధ్యాత్మికతా గ ధాన్ని స్వీకరించలేదని డా సి నారాయణరెడ్డి అభిప్రాయ పడ్డారు ప్రతీకవాదం లోని భావ వైచిత్ర్యంతో తప్ప తాత్త్వికదృష్టితో అరుద్రకు సంబంధం లేదు అరుద్ర త్వమేవాహం లో మధ్య తరగతి మానవ మనస్తత్వ చిత్రణానికి పైథాగరస్ సిద్ధాంతాన్ని సామ్యవాదాని కనుగుణంగా అన్వయింప జేసారు

చిన్న చిన్న చీమలు వగైరా
అడుగు భుజం అనుకోండి

రెండు భిన్నపక్ష సంజ్ఞల పోరాటం
అనగా ఒక నూతన వ్యవస్థ

ఇందులో సర్పం బూర్జువా వ్యవస్థకి చీమలు శ్రామిక వర్గానికి చతురస్రం సామ్యవాద సమాజానికి ప్రతీకలు ఆరుద్ర మానవ సమాజానికి ప్రతీ గా పుష్పాన్ని గ్రహించి శ్రామికవర్గాన్ని పెట్టుబడిదారీ సమాజాన్ని వర్ణించారు

మన సమాజ మొక
పూరా విప్పారిన పుష్పం

ఇందులో పుష్పాన్ని రక్షించే రక్షకపత్రాలు శ్రామిక వర్గానికి కీలాగ్రం పెట్టుబడిదారీ వ్యవస్థకూ ప్రతీకలు కీలాగ్రానికి కీటకాల వల్ల పరపరాగ సంపర్కం ప్రాప్త చినట్లు పెట్టుబడిదారీ వ్యవస్థకి ఫలిత చేకూరుతుంది దీన్ని నిలబెట్టిన శ్రామిక వర్గానికి ఫలిత శూన్యం ఇంకా ఆరుద్ర లోహాల్ని ప్రతీకలుగా గ్రహి చి సామాజిక విప్లవాన్ని సూ చించేరు ఇనుము పెట్టుబడిదారీ సమాజానికి రాగి తుత్తునాగాలు శ్రామిక మధ్య తరగతులకు సంకేతాలుగా స్వీకరించారు ఆరుద్ర ఇసుక గడియారం నీటి గడియార గతకాల మనస్తత్వానికి ప్రతీకాలుగా గ్రహి చారు కుందుర్తి తెలంగాణా లో

సూర్యుడికి దాలు తెలుపు

అ దులో దాక్కున్నవి అనేక రంగులు

అనె వచన కవితలో స ఘం కమ్యూనిస్టుపార్టీకి ఏడు ర గులు ప్రజాశక్తికి ప్రతీ లుగా స్వీకరి చారు అలాగే దాశరథి పునర్నవం లోని దూకి దూకి ఈ జలపాత ప్రాకించనీ పైకి పైకి విద్యుద్వల్లిమతల్లి కలను అనే కవితలో జలపాతం ప్రజాశక్తికి ప్రతీక బైరాగి నూతిలో గొంతుకలు కావ్యం లో అర్జునుణ్ణి హేమ్లెట్‌నీ రాస్కల్నికోవ్‌నీ మానవ స దిగ్ధ మనస్తత్వాలకు ప్రతీకలుగా గ్రహి చాడు పరాభి ఛడేలు రాగాల డజన్ లో నగర జీవితానికి సంబంధి చి విచిత్రమైన ప్రతీకలు వాడాడు బాలగంగాధర తిలక్ కొంతవరకూ ప్రతీకల్ని కాల్పనిక చారిమతో పరిమళం కల్పి చి వాడాడు వసుధైక గీతం గొంగళి పురుగులు కవితల్లో ప్రతీకల ద్వారా మధ్య తరగతి కిచ్చిన వ్యాఖ్యానం ప్రశ సనీయ – నారాయణరెడ్డి గారు మనిషి-చిలక లో పంచవన్నెల ఆ రామచిలక పరమాత్మకు మరొక ప్రతీ అన్నారు ఇంకిపోయిన బావి లో బావి భావ దారిద్ర్యంతో బాధ పడుతున్న ఛాందసత్వానికి ప్రతీక శేషేంద్రశర్మ గారు మండే సూర్యుడు తో నేను చెమట బందువుని అంటారు మ డే సూర్యుడు ప్రగతికి ప్రతీక చెమట బిందువు శ్రామికుడికి ప్రతీక ఇస్మాయిల్ చిలుకలు వాలిన చెట్టు చెట్టు నా ఆద ర్శం మృత్యువృక్షం కవితల్లో ప్రతీకల ద్వారా ఒక వాతావరణం నిర్మిస్తారు అరిపిరాల విశ్వం ప్రకృతి లోంచి వరించి వాటికి తన అనుభూతితో శృతి కలపడానికి ప్రయత్నిస్తారు మాదిరాజు రంగారావు ప్రతీకల్లో అనుభూతి తీవ్రత కాల్పనిక లాలిత్యం పెనవేసుకుని టాయి వేగుంట మోహన ప్రసాద్ పూర్తిగా అనుభూతి మీద ప్రపంచచిత్రాల్ని శబ్ద చిత్రాలుగా మలుచుకోవడం మీద ఆధారపడి ప్రతీకలువాడాడు అజంతా చెట్లుకూలుతున్నదృశ్యం నిస్పృహాకు లోనైన యువకుల మనోగ్లానికి ప్రతీ

వీరుగాక యింకా ఎందరో వచన కవితల్లో ప్రతీకలు వాడుతున్నా ప్రత్యేకంగా యిది సాధి చిన ప్రయో

జనం ఏమీ లేదనే చెప్పాలి వీటి మూలంగా కవిత్వంలో అస్పష్టత కొంతవరకు ప్రబలి భావ పాఠకుడికి అవగాహన కావడంలో కొన్ని సందర్భాల్లో యిబ్బంది కలిగిందనే చెప్పాలి

డి వి సూర్యారావు
లెక్చరర్ బి వి కె కాలేజి
విశాఖ పట్టణం-20

# జాతీయ కవితా పరమేష్ఠి

కవితాస్రవంతి ఎప్పుడూ రెండు వాహినులుగా ప్రవహాస్తూ ఉంటుంది ఒకటి మార్గమార్గము రెండవది దేశమార్గము ఈ విషయము వాఙ్మయ చరిత్ర కారు లంగీకరించినది మార్గ కవిత పండితైక వేద్యము దేశి కవిత బహుజనులకు సన్నిహితమైనదీ కవిసమ్రాట్ శ్రీ పైడిపాటి వారు రెండు మార్గములందు దిట్టలు అట్టులు డువారు చాలా అరుదనియే చెప్పవలెను

వారు జాతీయోద్యమములో పాల్గొనినవారగుటచే వారి దృష్టి దేశ భవిష్యత్తు మీద ఎక్కువగా ఉంటుంది తమిళనాడులో సుబ్రహ్మణ్య భారతి తెలుగునాడులో శ్రీ గరిమెళ్ళ సత్యనారాయణ గారలు తమ స్వాతంత్ర్య గీతులతో దేశాన్ని ఉత్తేజపరచినవారు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత జాతీయతా స్వరూపం ఎల్లా ఉండాలి ? అని తర్కించుకొని ఒక మార్గం చూపినవారు పైడిపాటివారు అందుచేతనే వారిని జాతీయ కవితా పరమేష్ఠి అంటున్నాను

## జాతీయ భారతి

వారు జాతీయభారతిని రచించి రాధాకృష్ణ పండితుడికి అంకితం చేశారు "శైలి సారళ్యమందేమి పద గుంభనమందేమి జవబాహుళ్యపు హృదయోద్దీపనమునకీ గ్రంథము తోడ్పడుటలో అతిశయోక్తి లేదు అని తొలిపలుకు రచించిన శ్రీ బూర్గుల రామకృష్ణారావుగారు ప్రశంసించారు మీ మాటలె మంత్రంబులు అని మలిపలుకు పలికిన ఆచార్య రంగా గారు కొనియాడారు జాతీయ భావంతో కవిత్వానికి ప్రోత్సాహం ఎట్లో అట్లే కవిత్వ వల్ల కూడా జాతీయ ధర్మానికి దేశంలో ప్రోత్సాహం కలిగింది ఇవి పరస్పరాశ్రితాలు రాజకీయ వేత్తల శుష్క వచనాలకు వీరు కావ్యత్వం కలిగించి గానమయ చేశారు ఇవి నేను ఏమాత్రం అతిశయోక్తి లేక చెప్పే మాటలు మన పూర్వుల లక్ష్యం ధర్మసంస్థాపనం ఈ ఆశయం ఈ కావ్యంలో ఆమూలాగ్ర నిర్వహా పబడి ది అన్నారు డాక్టర్ దివాకర్ల వేంకటావధాని గారు 1951 లో గ్రంథావిష్కరణ సందర్భంలో హైదరాబాదులో ఆ సభలోనే శాసన సభాపతి శ్రీ కాశీశ్వరరావు గారు శాస్త్రిగారికి కవిసమ్రాట్ బిరుదాన్ని సమర్పించారు

## పంచ ఖండాలు

ఈ గ్రంథాన్ని శాస్త్రిగారు అయిదు భాగాలుగా విభజించుకున్నారు ప్రథమ ఖండంలో తమ లక్ష్యాన్ని వివరించారు రామరాజ్య మాకు రావాలి వేదకేతన మెగుర వేయాలి అనేదే వారి లక్ష్యం ఇందులోనే త్రిలింగ దేశం మనదోయ్ అనే గేయం కూడా ఉంది ఆంధ్ర వైభవాన్ని కీర్తించే గీతాలలో దానికి సాటి గీతం ఇంతవరకు పుట్టలేదంటే అతిశయోక్తి కాదు దానిని గానం చేయించి ప్రథమ ప్రపంచ తెలుగు సభలలో శాస్త్రి గారికి ప్రభుత్వ సన్మానం చేసింది

ద్వితీయఖండంలో భారతీయ నాయకులపై గీతాలున్నాయి నిక్కచ్చి నీ మాట తీరు ఉక్కుమనిసి వన్న పేరు విన్న చాలు రారు శత్రుల కెల్ల అని వల్లభాయి పటేలును కీర్తించారు దుగ్గిరాల గోపాల కృష్ణుడా ! నీ రుగ్గె నిరంకుశము భారత యోధుడ ! అని ఆంధ్రరత్నను కీర్తించారు

తృతీయ ఖండంలో మన పండుగలను గూర్చి గేయాలు వ్రాశారు అందులో ఆగస్టు 15 గీతం ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు కన్నామీ స్వాతంత్ర్యం అన్నది 15-8 59 న లెనిన్‌గ్రాడు యూనివర్శిటీలో తెలుగు విభాగానికి అధ్యక్షులైన శ్రీమతి ముదిగొండ ఆదిలక్ష్మి గారు తాము నిర్వహించిన టెలివిజన్ కార్యక్రమంలో రష్యన్ ప్రజల మన్నన లందుకొన్నదని 17 2 1960 ఆంధ్ర వారపత్రిక లేఖలో వ్రాశారు

చతుర్థ ఖండ లో ప్రబోధికా కార్యక్రమాలను గూర్చి వ్రాశారు పంచమ ఖండ లో ప్రబోధ గీతాలు వ్రాశారు వెను టి వాడవు కావోయీ నీవు మును పటి వాడవు కావోయీ అని స్వరాజ్యావ త భారతీయులలో ఏర్పడిన తళుకును గూర్చి చెబుతూ భారతదేశ మన దేశం ప్రపంచానికే గురుపీఠ అంటారు పుట్టినా వీ భారతదేశాన చేత పట్టినావా గీత ఎపుడైనా ? అని తోటి భారతీయుణ్ణి నిగ్గతీస అడుగుతారు భారతీయతకు గీతాపఠనం ప్రధానమని వారి అభిప్రాయం

ఈ జాతీయభారతి ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించిన శ్రీ మండుముల నరసింగరావు గారు త్రిలింగదేశ నృత్యనాటిక తనను ముగ్ధుణ్ణి చేసిందని చెప్పారు

## జయభారతి

జయభారతి అనే గ్రంథ పరిమాణంలో చిన్నది ఆంధ్రరాష్ట్రం రాకముందు వ్రాయబడినది రాదు రాదురా రాష్ట్రం ఆంధ్రుడ ! వృథా కంఠశోష విశ్వ దృష్టిలో తెలుగు తమ్ముడు వెనుకను పడ్డాడు– అని చెబుతూ లేరా తమ్ముడ లేరా రాష్ట్రం పరా పేక వద్దూ నీ ఒక్కడవే నీ వొక్కడవే నీ దిక్కు చూసు కోరా ! అని హెచ్చరిస్తారు

చివరకు వారు చెప్పినట్టే జరిగింది పొట్టి శ్రీరాములు గారు ఆత్మార్పణం చేసుకుంటేనే కాని రాష్ట్రం రాలేదు ఈ గ్రంథ లో గరిమెళ్ళను గూర్చి వ్రాస్తూ పాట వ్రాసి జనుల బాట తీర్చావు పాటనీ జీవితమై కాటు వేసింది అంటారు మా కొద్దీ తెల్ల దొర తనము అనే పాట ఉద్యమం రోజుల్లో పిటపిట మ్రోగింది కాని గరిమెళ్ళ వారు బందీ అయారు తర్వాత వారు సుఖపడింది లేదు అల్లాగే సుబ్రహ్మణ్య భారతిని గూర్చి కూడ వ్రాశారు నేడైనది స్వాతంత్ర్య చూడ నోచలేదు నీవు భరతదేశమును పాడిన భారతి సుబ్రహ్మణ్యం ! అంటారు

శాస్త్రిగారు జాతీయోద్యమపు రోజుల్లో వాలంటీరుగా పనిచేశారు స్వతంత్ర భారతంలో స్వేచ్ఛా వాయువులు పీలిస్తున్నారు ఈ అదృష్టం భారతికి లేదని శాస్త్రిగారి విచారం !

ప్రకాశం గారిని గూర్చి వ్రాస్తూ ప్రజల మనిషిని నేను ప్రజలే నేనన్నాడు ప్రజల కాపదపట ప్రత్యక్ష మైనాడు అంటారు ఈ కృతిని కాశేశ్వరరావు గారు స్వీకరిస్తూ తమిళభాషకు సుబ్రహ్మణ్య భారతి ఎట్లో ఆంధ్రభాషకు సుబ్బరామశాస్త్రి గారట్లు ! అని ప్రశంసించారు ఆ సభకు పట్టాభి గారు అధ్యక్షత వహించారు విజయవాడలో ప తులు గారన్నమాట పాఠకంగా మాత్రమే త్య

జాతీయగీత రచనలో భారతికి శాస్త్రి గారు తుల తూగే వరకే అది సత్యం కాని భారతి గేయకవి మాత్రమే శాస్త్రిగారు వచన నాటకము గేయము పద్యము మొదలైన వివిధ ప్రక్రియలలో అందె వేసిన చేయి

## విజయభారతి

విజయ భారతి కూడా జాతీయగీతాల సంపుటమే రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డి గారు ఆంధ్రప్రదేశ ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడది వారి కంకితమైనది దానికి పీఠిక వ్రాస్తూ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు గారు ఆధునిక జాతీయ కవులలో వీరగ్రేసరులు శ్రీ భారతి గరిమెళ్ళలకు స్వరాజ్యపు పోరాటపు కాలములో గల స్థానమే జాతి పునర్నిర్మాణ సందర్భమున శ్రీ శాస్త్రి గారికి కలదు అని వక్కాణించారు చక్కని అనుభూతితో పదముల కూర్పు నేర్పుతో జాతీయతా ధర్మమును రమణీయముగా బహుముఖములుగా గానము చేయు వీరి ప్రతిభ స్తుతి పాత్రము అంటారు

ఎత్తరే దివ్వటీలు ఒత్తండే శంఖాలు కొలువు తీర్చి దేశమాత కొలువు తీర్చెను అని భరతమాతను ఇందులో కీర్తిస్తారు రాజు వోలె రారా రాజువోలె రారా ! వంగి వంగి దండాలను సంగతులిక లేవురా కలిమి బలిమి తోడ నిట్ట నిలువుగా నడవరా ! అని భారతీయుణ్ణి హెచ్చరిస్తారు గగన వీధి చూడరా ! కంఠమెత్తి పాడరా ! ఎంత ఎత్తు ఎగిరినదో ఈ దేశపు మన జెండా అని త్రివర్ణ పతాకపు ఔన్నత్యాన్ని చాటి చెబుతారు ఈ గ్రంథ లో విస్మృత వీరుల త్యాగాల నుగ్గడిస్తారు

అందుచేతనే మలిపలుకులో మానికొండ సత్యనారాయణ శాస్త్రి గారు విన్నంతసేపు నేనీ జాతీయోద్య

మములో మ ల ండలు మంచి తిరుగుచున్నట్లు పూర్వా నుభూతుల స్ఫు ణలో నిమగ్నుడనై యు ంటిని నా అనుభూతిని ఒక్కమాటలొ చెప్పవలెనంటే అది ఆనంద మనియే చెప్పవలెను అన్నారు మన దేశం గేయం చదువుతున్నప్పుడు శరీరం ఉప్పొంగుతుంది మెత్తని యెద సుతి మెత్తని మేను ఒత్తిగిలెను కారాగారములొ అని చదువుతున్నప్పుడు కరుణరసం పొ గి పొర లెత్తు తున్నదంటే అతిశయోక్తి కాదు అని కొండాతి అంజ ఆంజనేయులు గారు ప్రశ ంచారు

ఒళ్ళు పులకరించి ది స్వరాజ్యం సాధింపబడినది కాని దేశంలో నుండి దేశభక్తి పారిపోయినట్లు కని పిస్తోంది చలముతో దానిని తిరిగి రగులుకొలుపుతోంది అని ముదిగంటి జగ్గన్నశాస్త్రి గారు కొనియాడారు

ఎన్నటి మాటలో ఇవన్నీ ఉన్నవో లేవో జ్ఞప్తి ఏర్చి కూర్చి వెనుక నాగి ఇట్టె కనులు కట్టితివి అబ్బుర మగు గీతిపోకడబ్బిందో యీ సుకవీ సుబ్బరామశాస్త్రి ఓయి సుబ్బరామశాస్త్రి ! అని గీతిలో ప్రశంసించారు శ్రీ గురజాడ రాఘవశర్మ గారు

## విక్రమభారతి

తరుమండీ తరుమండీ ! తరిమి తరిమి కొట్టండీ ! అని తొలిగా చైనా దురాక్రమణపై గర్జించిన కవి సమ్రాట్టు వీరు దేశరక్షణ కోసం ప్రత్యేకంగా వ్రాసిన గ్రంథమే విక్రమ భారతి దానిని వెలమ జమీందారు శ్రీ మేకా రంగయ్యప్పారావు గారి కంకి తం చేశారు ఇ దిలో కొన్ని గేయాలు ప్రభుత్వ తమ శంఖారావం భేరి సంపుటాలలో ప్రకటించు కొన్నది అన్న యని నమ్మించినాడు ఓ భాయి ! వెన్నులోనే పొడిచినాడు అని చైనీయుడి పనికి విచారి స్తారు మెరుపుల్లా ఉరుముల్లా కెరటంలా లేవ డీ ప్రజలారా నా ప్రజలారా ! అని హెచ్చరిక చేస్తారు, ఈ గీతాలలో కొన్ని ఆకాశవాణిలో వినబడుతునే ఉంటవి

## ముగింపు

శాస్త్రిగారిలో ఎంత ఆత్మ విశ్వాసం ఉన్నా కొంత వైరాగ్యం కూడా ఉన్నదేమో ననిపిస్తుంది విజయభారతి లోని ఈ గేయాన్ని చూడండి

జాతిగీతులెల ని
జాయితీ విల్వమేం
జాతియ కవిరాట్టు !
జాతికైన సమ్రాట్టు !
కూడు వచ్చునా నికు
గుడ్డ వచ్చునా !

పాడవోయి ఆకలినో
పాడవోయి చీకటినా
పూవునో కాయనో !
పూవు బోడినో
జాతి ముందు నడపు వి
ఖ్యాతి నీకు కలిగినా —
ఇంటింటా పేరు జే
గంటవోలె మ్రోగినా —
కాలికందె వేతురా !
గద్దె నెక్కింతురా ?
దొరతనమ్ము మారినా
మరుతరమ్ము వచ్చినా

వాస్తవానికి జాతీయ కవులకు కవి గండపెండేరాలూ గజారోహణోత్సవాలూ చేసినప్పుడే జాతి జీవించి ఉన్నదని మనమనుకొనగలం మనం ఎక్కడ ఉన్నామో మనము పునరాలోచించుకొనవలసిన అవసరం ఎంతయినా ఉంది

8-2 67 న డాక్టర్ దివాకర్ల వాక్యాలతో ఈ వ్యాసాన్ని ముగిస్తాను మార్గ కవితకు తుల్యంగానే దేశి కవి మనసాహిత్యంలో నడిచింది జాతీయ భారతి యీ రెండవ కోవలో ఉత్కృష్టమైన శ్రేణికి చెందిన రసమయ మైన కావ్యం భాష ఛందస్సు ఉత్తమమైనమార్గంలో నడి చినా భాష వ్యావహారికమైనా గ్రాంధికానికి సన్నిహితం గ్రాంధిక భాషాభిమానులకు ఇది గ్రాంధికమేనని అనిపి స్తుంది

శాస్త్రిగారి జాతీయ భారతి జాతీయతకు భగవద్గీత వంటి దని నానమ్మకం

జి భవానీ కుమారి
ఎస్ ఎస్ బి వి హైస్కూల్
గాంధీ నగర్
విజయవాడ 520 003




# కన్నీరు

రచన- స్వర్గీయ కర్ణవీర నాగేశ్వరకవి

వెల రూ 3 00

పబ్లిషర్స్- జాన్సన్ పబ్లిషింగ్ హౌస్

గుంటూరు-3

సంస్కృతాంధ్ర హిందీ భాషల్లో ప్రవీణులై ఆ భాషల్లో గ్రంథ రచన చేసిన పండిత కవి కర్ణ వీరనాగేశ్వరులు వీరు మహా మహోపాధ్యాయ విద్యా వాగీశా ది బిరుదాంచితులు వీరు రచించిన ఈ కన్నీరు అనే కృతి ఒక స్మృతి కావ్యం నాగేశ్వర కవి కుమార్తె మోద ప్రసూనాంబ పెండ్లి జరిగిన కొద్ది కాలానికే మరణించగా పుత్రికా శోకభరితులైన నాగేశ్వరకవి కార్చిన కన్నీరు కావ్యంగా రూపు గట్టింది

నాగేశ్వర కవిగారి కూతురు మోద ప్రసూనా బ విద్యావంతురాలై రచయిత్రియై బాలభారతి బిరుదు పొందిన ప్రతిభా సంపన్న ఆలాంటి కూతురు మరణించడం కన్నతండ్రికి కలిగే దుఃఖం ఎంతటిదో ఊహాతీతం కదా ! "శోకఃశ్లోకత్వమాగతః అనే ఆభాణమునకు తార్కాణగా నాగేశ్వర కవి శోకం కృతిగా ఆకృతి దాల్చింది

ఈ కావ్యమంతా ఆటవెలది తేటగీతి పద్యాల్లో సాగింది ఇందులో నియమము ప్రతిభా హరము తెలుగు సంస్కృతము హిందీ సంస్కారము పెండ్లి మాతృభక్తి తండ్రి గురువు దైవభక్తి ప్రణయము అత్తమామలు మొదలైన శీర్షికల క్రింది మోద ప్రసూనాంబ గుణగణాలనూ విద్యా వినయ సంపన్నతనూ పేర్కొంటూ కవిగారు తమ బాధా భరిత భావాలను ప్రకటించారు పద్యాలు కవి దుఃఖభారాన్ని ప్రకటిస్తూ పఠితల హృదయాలను ద్రవింపవేస్తాయి

"ఉభయ వంశములకు నురుతర కీర్తిని
కూర్తువంచు నాదు గోర్కె గలదు
పెద్దవార లెన్నొ పెండ్లికి దీవనల్
పంపినారు కాని ఫలిత మేది ?
"వచ్చినట్టి సుగుణవర్యులు మిత్రముల్
మెచ్చినారు కాని మేలుసున్న
అమ్మలక్క లెల్లనాడిరి పాడిరి
వారిపాట లెల్ల వ్యర్థమయ్యె

ఆనే ఈ పద్యాలు కవిగారి ఆవేదనను ప్రత్యక్షం చేస్తున్నాయి పద్యశైలి సరళంగానూ సుబోధకం గానూ ఉన్నది ఆటవెలది పద్యాలు కొన్నిటిలో మొదటి మూడు పాదాలు రెండు నాలుగు పాదాలుగా ఉండడం వింతగా కనబడుతుంది కొన్ని పద్యాల్లో గణయతిభంగాలు ఉండడం చింత్యం !

— వేముగంటి

# ఏది మినీ కవిత

రచన - రావి రంగారావు
వెః 0 25 పైసలు
ప్రచురణ - స్పందన సాహితీ సమాఖ్య 26 162 బుట్టాయిపేట మచిలీపట్టణం - 521001

ఇది 12 పేజీల చిన్న పుస్తకం 11 వచన కవిత లోనిఅయోమయ భావాలవలన సమాసాడంబరం వలన పునరుక్తులవలన నినాదాల వలన వ్యక్తీకరణంలోని పులుముడు వలన కృతకమైన అంత్యప్రాసాది నియమాలవలన ప్రజలు ఆధునిక కవిత్వంఅంటే పారిపోయే స్థితికి వచ్చారు ఇటీవలి కాలంలో ప్రజల్ని మళ్ళీ కవిత్వం వైపు మొగ్గుచూపేటట్లు చేయగలుగుతున్నది మినీ కవిత మాత్రమే అంటూ రచయిత ఈ పుస్తకాన్ని (వ్యాసాన్ని) ప్రారంభించారు ఈ మాటలను పరిశీలిస్తే వచన కవితకు కాలం చెల్లిపోయిందనీ ఇక మినీ కవితదే రాజ్యమనీ అనిపించకమానదు కాని ఇది సరైన నిర్ణయం కాదనక తప్పదు ఎందుకంటే మినీ కవిత అనేది ఒకకవితా ప్రక్రియ మాత్రమే కనుక

రంగారావుగారు నిజమైన మినీ కవితకు ఉండే అతి ముఖ్య లక్షణాలను ఇట్లా పేర్కొన్నారు

1 సంక్షిప్తత 2 వ్యక్తీకరణంలో సూటిదనం 3 వ్యవహార వ్యావహారిక భాష 4 కొత్తదనం 5 భావగాంభీర్యం ఈ లక్షణాలకు కొన్ని ఉదాహరణలు కూడా చూపబడినవి కొన్ని మినీ కవితలకు చేసిన వ్యాఖ్యల విషయంలో రంగారావుగారి ఊహాబలం గమ్మత్తుగా ప్రసరించింది

"నిజమైన మినీ కవితల్ని చదివి ఆనందానుభూతి పొంది పాఠకులు చైతన్యవంతులు కావాలని నా ఆకాంక్ష" అంటూ రచనను ముగించారు రచయిత మినీ కవిత లక్ష్యం కేవలం ఆనందమేనా? అనే సందేహం కలుగుతుంది మినీ కవిత వ్రాసే కవులు రంగారావుగారి పైఅభిప్రాయాన్ని ఆమోదిస్తారనుటకు ఆస్కారం తక్కువే

— వేముగంటి

# శిలాలోలిత

కవయిత్రి రేవతీదేవి
వెం రూ 6-50
ప్రతులకు 1 నవోదయ పబ్లిషర్స్ విజయవాడ-2
2 బుక్ డిస్ట్రిబ్యూటర్స్ సికిందరాబాదు-3

మీరు పంపిన శిలాలోలిత చేరింది పూర్తిగా చదివాను ఈ రచయిత్రి కవితా రసవాహినితో నాకు పూర్వపరిచయం కలుగకపోవడం దురదృష్టకరమనుకున్నాను

ఈమె రాసిన యీ వేదనాకృతులు పబ్లిషించి మీరు తెనుగు దేశానికి గొప్ప ఉపకారం చేశారు ఇంత చిన్నతనంలో యీమె మృతి తెలుగు సాహిత్యంలోని వచన కవితా శాఖకు ఒక గొప్ప లోటు

ఇది స్థూలంగా చూస్తే వచన కవిత్వంలో ప్రేమ కవిత కాని స్వీయానుభూతిని ఎంతగా కవిత్వీకరించిందో సాధారణీకరించిందో మాటల్తో చెప్పలేకుండా వున్నాను ఆమె మనస్సులో ఎంత ఎత్తున బడబాగ్ని జ్వాలలు రేగాయో ప్రత్యక్షరంలో ప్రత్యక్షంగా కనిపించే విధంగా expressions మలచుకొని మన ముందర వుంచిన యీమె నిశ్చయంగా గొప్ప కవయిత్రి ప్రతి పంక్తి బాటలో ఏదో ఒక భగ్న మనోరథం పరుగెత్తటం చూశాను రసస్పర్శిగా హృదయస్పర్శిగా

తానెందుకు యిది తన సొంత గొంతు కాదనుకున్నదో తెలీదు దానిని సంజీవదేవ్ గారెందుకు సమర్థించారో అసలే తెలీదు ఆమె నిత్యజీవితంతో సంబంధం కలవారికి ఏవైనా విషయాలు తెలిసేమో గాని తెలియని నాబోటివారికి అలా అనిపించలేదు వచన కవిత్వపు expression లో యిదివరకు వకరిద్దరు కవులు పోయిన పోకళ్ళు కనిపించాయి కానీ ఏదీ ఎవరి సొంతమూ కాదు అలాగే భావాలు కూడానూ ఆమె ఎవరి భావాలను అప్పు తెచ్చుకున్నా

నని అనుకున్నదో అవన్నీ ఆయన నొంత భావాలు కావు అసలు సృష్టిలో సొంతభావాలు అనేవి వుండవు అందరూ అందరినీ చదువుతూ అందరివీ నేర్చుకుంటారు కాబట్టి రచయిత్రి అవిధంగా రాసుకోవడం అనవసరం అనుకున్నాను

ఇది స్వీయానుభూతుల్లోనుండి పెల్లుబికి వచ్చిన protest కవిత్వంగా నేను భావిస్తున్నాను ఈ తిరుగుబాటు సమాజం మీదా, మూఢ విశ్వాసాలమీదా మూఢాచారాలమీదా యింకా యింకా చివరికి ఈ వ్యవస్థమీదా హ్రస్వకవితలు ప్రభావాత్మకంగా వున్నాయన్న పీఠికాకారుని మాటతో నేనేకీభవించను గంగాప్రవాహంలా దూకివస్తూ దీర్ఘ కవితలు కూడా చాలా సంచలనాత్మకంగా నన్నాకర్షించాయి ఒకసారి వేగుంట మోహన్ ప్రసాద్ శైలిని గురించి రాస్తూ, పాతికేళ్ళ క్రితం యిది వచన కవితకు వన్నె దిద్దే దిగా వుందని నేను వ్యాఖ్య చేశాను ఈమె శైలికూడా అటువంటి వన్నెచిన్నెలు కలదే అయితే ఆయనలోని అస్పష్టతా మార్మికతా యీమెలోలేనందున హృదయం మీద అచ్చుగుద్దినట్లు కవితలు అతుక్కుంటూ వున్నాయి మామూలు భాషకూ కావ్య భాషకూ మధ్య దూరం తగ్గిందని సంజీవదేవ్ గారన్న మాట నిజం దానిని యీ కావ్యం చక్కగా ప్రతిఫలించింది నిజానికి యీకాలపు విలువలను బట్టి మాట్లాడుతున్నట్లున్న కవిత్వమే మహాకవిత్వము అస్పష్టత కవితకు కళంకం కాదని సంజీవదేవ్ గారన్న మాట నిజం కాదు అది పెద్ద కళంకమే Cammunications gap ఏర్పాటు చేసే తత్వం గల అస్పష్టత కవులకు పరిహార్యము చిత్రలేఖనం వగైరాల్లో నేను చెప్పలేను మాటా అర్థమూ అవగాహనా అవసరమైన చోట అస్పష్టత అనాదరణీయము అసలే వాక్యార్థము కావ్యార్థమూ వేరుగా వుంటాయి కావ్యార్థము తెలిసే విధంగా వాక్యార్థ నిర్ధారణం చేయడం ఉత్తమ కవితా లక్షణమవుతుంది

ఉన్మాద ప్రకృతి కవిత చాలా గొప్పది ఇదంతా కవయిత్రి మనస్సులో మండే మంటల ప్రతిధ్వని కావచ్చు కాని దీన్ని ఒక objective poem గా చూసుకున్నా గొప్పదిగానే భాసిస్తున్నది ఉక్కు శిశువు కూడా గొప్ప రచన తన protest నుంచి విప్లవాభిముఖమైన రచయిత్రి మనఃస్థితిని చక్కగా తెలిపిందీ కవిత చివరి poem అనురాగ దగ్ధసమాధి గా కాకుండా దినినే నేను యీ కావ్య పర మార్థంగా భావిస్తున్నాను protest లోనుండే విప్లవ భావాలూ మార్పూ వస్తాయి కనుక

దేవుడూ అనే శీర్షిక యీ గ్రంథంలో లేకుండా వుంటే బాగుండేది కేవలం అనుకరణ అనిపించే యీ రచనను తొలగించవలసింది

మనుషుల్లో వుండే అవినీతీ కాపట్యం నిజాయితీ లేనితనం మనిషికీ మనిషికీ, మగవాడికీ ఆడదానికీ మధ్య యీ సమాజం ఏర్పరచిన ద్వంద్వ ప్రమాణాలూ మొదలైన వాటిమీద ధ్వజమెత్తి తన గళాన్ని రణభేరిగా మ్రోగించిన యీ కవయిత్రికి ఆయుర్దాయమే వున్నట్లయితే

మలిపలుకు వద్ద ప్రకటించిన ఆ సంబల్ ఏమిటో నాకు బోధపడలేదు

చివరకు ఒక మాట I was really thrilled with her way of expressions

ఈ గ్రంథం నేను చదివే అవకాశం కల్పించిన మీకు కృతజ్ఞుణ్ణి

— (స్వర్గీయ కుందుర్తి)






# సాహిత్య సమావేశాలు

## శారదాంబ పద్యాలు ఆవిష్కరణ

ది 19-11 82 న ఆంధ్ర సాహిత్య పరిషత్తు ప్రాంగణంలో జరిగిన శారదాంబ పద్యాలు కృత్యావిష్కరణ కృతి సమర్పణ సభలో శ్రీ దివాకర్ల వెంకటావధానిగారు ఇలా అన్నారు

ఈ శారదాంబ పద్యాల ఆవిష్కరణ సభకు అధ్యక్షులైన రామానుజరావుగారు ముఖ్య అతిథిగా విచ్చేసిన హోంశాఖామాత్యులు శ్రీ రోశయ్యగారు ఆశీర్వదించడానికి ఏతెంచిన శ్రీ సర్వేశ్వరానంద స్వాములవారు ఆస్థానకవి దాశరథిగారు స్వీకర్తలైన శ్రీ కె రాధాకృష్ణయ్యగారు వారి వారి స్థానాలలో చాలా గొప్పవారు ఇంత మంది విశిష్టుల మధ్య నా చేతనే ఈ కావ్యం ఆవిష్కరించబడాలా? జంగయ్యగారు నన్ను కోరడం నాయందున్న వారి అవ్యాజమైన ప్రేమను వ్యక్తం చేసిందిగా భావిస్తున్నానంటూ- నేనాయనకు పాఠాలు చెప్పిన గురువును కాదు నా వద్ద ఆయన చదవలేదు పాతిక సంవత్సరాలకు పైగా నన్నెరిగినవాడు జంగయ్య అప్పుడప్పుడు మా యింటికి వస్తూ ఉంటాడు అప్యాయంగా మాట్లాడటం అటుంచి ఎప్పుడు చూసినా సాహిత్య సమాలోచన చేస్తూ సంభాషిస్తాడు ఆయన బహు గ్రంథకర్త ఈ గ్రంథం ఇరవై ఆరోది జంగయ్యగారి కవిత్వం ప్రసన్నమైన శైలితో ఒప్పారుతుంది అక్కడక్కడ వ్యావహారికాలను పొందుపరచే పద్ధతి ప్రతి గ్రంథంలో చూసినాను కవితావేశం మనల్ని ఆకట్టే తీరులో ఆయనయందున్నది నాకు మిత్రులైన రాధాకృష్ణయ్య శ్రేష్ఠిగారికి గ్రంథం అంకితం కావడం మరో విశేషం సభనలంకరించిన పెద్దలేకాక సభలో ఉన్న పెద్దలు కూడా ఈ కవి రచనలపట్ల జీవితంపట్ల అంతో ఇంతో ఉపయోగపడినవారే వీరంతా ఈ సభలో ఉండటం నాకెంతో ఆనందంగా ఉన్నది అంటూ ఈ పద్యాలు వేమన వరవడిలోసాగినవని ఉదాహరిస్తూ ఉపన్యసించారు దీనిలో 516 ఆటవెలదులున్నాయి ప్రతి ఆటవెలది మనోహరంగా ఉన్నది ఈ పద్యాలు సహృదయులకు నైవేద్యాలు అన్న దాశరథిగారి పీఠికతో పూర్తిగా ఏకీభవిస్తున్నాను కవే ఈ గ్రంథానికి సమకూర్చిన ప్రవేశం రచనోద్దేశంలో వర్తమానాంధ్ర సాహిత్యలోకాన్ని ప్రభుత్వ విషయాలను- సాంఘికాచారాలను సంభావించి అందలి చెడులను చూపుస్తూ మంచివైపుకు ప్రయోగించవలెననే సదాశయాలు ఈ పద్యాల్లో ఉన్నవి జాతికి శ్రేయస్సునిచ్చే ఈ ఆటవెలదులు సర్వ మానవులు చదువదగినవి - అని ఆచార్యులవారు పునరుద్ఘాటించినారు

ఈయన చూస్తే చాలా అమాయకంగా ఉన్నట్లే కనబడతారు సముద్రంలో బాడబవహ్ని ఇతని కవిత వర్తమాన పరిస్థితుల్ని జీవన విధానాన్ని సాహిత్య ధర్మాన్ని సాధించిన కవితగా శారదాంబ పద్యాలను వివరిస్తూ ఆంధ్ర శారదకీ గ్రంథం అమూల్యాభరణంగా అందించినారంటూ ముగించినారు

ముఖ్య అతిథి హోం మంత్రి శ్రీ రోశయ్యగారు ఇలా అన్నారు తీరికలేని పనులల్లో ఉన్నా మిత్రులు జంగయ్యగారిపట్ల ఉన్న ప్రేమతో బాటు శ్రీ రాధాకృష్ణయ్యగారిపట్ల గల అనురాగం కూడా కలిపి ఈ సభకు రావలసవచ్చినది జంగయ్యగారు నగరంలోని చాలామంది పెద్దలకు పూజ్యులకు కృతులంకితం చేసినాడు నాకు కూడా ఓ గ్రంథం దర్శనాన్ని అంకితం ఇచ్చినారు ఆయన నిరాడంబరుడు సమాజ

సంక్షేమం ఆశించి రచనలు చేసినట్లు నాకు తోచినాడు ఆయన వ్రాసిన ఏ పుస్తకం చూచినా- కూడా సంభాషించినా - ఆ ఆవేశం తహతహ తపన - సమాజం పట్ల ఉన్న గౌరవం సాహిత్యం పట్ల ఉన్న ప్రీతి ప్రస్ఫుటించి ఉంటాయని ఈ అవకాశం శ్రీ రామానుజ రావుగారి వంటి పెద్దల్ని కలుపుకొని అతిథిగా ఈ సభలో పాల్గొనే అవకాశం కలిగించినందుకు జంగయ్య గారిని రాధాకృష్ణయ్యగారిని అభినందిస్తున్నానన్నారు

కృతికర్త శ్రీ నీలా జంగయ్య మాట్లాడుతూ నేను రాజకీయ రంగంలో 13వ ఏట ప్రవేశించి చదువు మానినవాణ్ణి - 20 ఏండ్ల వయస్సు వచ్చేదాకా కను విప్పు కలుగనివాణ్ణి అందులో ఉన్నా పాటలు గీతాలు రచించి పాడేవాణ్ణి 1954 నుంచి పూర్తిగా రచించి కాకున్నా సాహిత్యాన్ని పాక్షికంగా అధ్యయనం చేస్తూ ఉండేవాణ్ణి నరుల మధ్య మెలగడం భయం పొంది అడవిపడదామనుకుంటే అక్కడ పులుల బాధకు వెరచి బ్రతుకుతున్నవాణ్ణిగా చెప్పుకొని 1960 నుంచి రాజకీయాలు పూర్తిగా వదిలి వేసినానని మొదట కమ్యూనిస్టుగా- తరువాత కాంగ్రెసుగా ఆ తర్వాత సోషలిస్టుగా పార్టీల్లో ఉండేవాణ్ణి అని గతాన్ని స్మరించినారు ఉద్యోగంలో 20 ఏండ్లు పైగా జీవించిన వాణ్ణని నా ప్రత్యేకత ఏమయిన ఉంటే అది సాహిత్యంలోనే ఉంది సంఘంలోని ఆ కృషిని పెద్దలకు పూజ్యులకు సేవకులకు చక్కని పాఠకులకు అంకితాలిచ్చినానని- డబ్బుగోరి ఎవరికీ ఏ పుస్తకం అంకితమీయలేదని ఈయడానికి ఉన్నా ఈయలేదని అడగడం నాకు చేతకాదని ఈ గ్రంథం శారదాంబ పద్యాలను కోటీశ్వరుడై కూడా సాంఘిక సేవ మరవని ధర్మాత్ముడైన శ్రీ కె రాధాకృష్ణయ్య గారికి అంకితం ఇచ్చుకున్నానని వారు ఈ విషయానికి అంగీకారమిచ్చి సభలో కృతినందుకొన్నందుకు నాకానందంగా ఉందని స్వల్పంగా ముచ్చటించి అంకితం పద్యాలు చదివి ముగించినారు

కృతిభర్త శ్రీ కె రాధాకృష్ణయ్య మాట్లాడుతూ జంగయ్యగారు నేను వైశ్యమహాసభకు అధ్యక్షుడగా ఉన్నప్పుడే అంతులు ఇస్తారు చెప్పగా నేను తగునా అని కొంచెం విచారించి భగవంతుడాయనకు ఈ బుద్ధి ఎందుకు కలిగించినాడో సరె మంచి పని ఎటు కాదని గలరా? అయినా ఆయన మాటను మనలోని పెద్దలు ఎవరూ తీసివేయరు ఆ దృష్టితో అంగీకరించినాను ఆయనకు నేనేమి చేయగలను రాజులు అనాడు కృతులు కవులచే అంకితాలు పొంది చిరంజీవులైనారు చరిత్రలో నిలిచినారు ఆయన పద్యాలను మా నరవు గారు ముఖతా విని ఆనందించి ఇవి సుమతి వేమన బద్దెన వంటి మహా రచయితల కోవకు చెందినవిగా సంభావించి స్వీకరించి ఈ సభను జరపడంతాయింది మంత్రులు రోశయ్య, హోం మంత్రిగారు- రామానుజ రావు వంటి పెద్దలు ఈ సభలో ఉండి పూజ్యులు అవధానిగారు ఆవిష్కరించడం నా అదృష్టంగా భావిస్తున్నానన్నారు

ఆస్థానకవి దాశరథిగారు మాట్లాడుతూ మాతోబాటే ఉదయించిన కవి శ్రీ జంగయ్యగారు పల్లె నుంచి పట్నం చేరాడు ఆయన అంతర్ముఖుడు వేదనా భంతుడు అయినా 25 సంవత్సరాల కింద వ్రాసిన బుచ్చిలింగ పద్యాలు ఎన్నెంతో ఆకర్షించినాయి సాహిత్యమనసీలి జంగయ్య ఆ తరువాత ఎన్నో గ్రంథాలు వ్రాసి మనల్ని ఆనందిపరచినారు బలం బలం గలవాడే కులంబలం విదనాడాడీ కవి ఇలాగే ఒక పనిగా రచనలు సాగించి యశోధనుడై వెలుగొల్లాలని ఆశీర్వదిస్తున్నాననడం కంటే ఆకాంక్షిస్తున్నాననడం మేలని జంగయ గారి పట్ల మా రామానుజ రావుగారి వాత్సల్యం కొనియాడదగిందిగా చెబుతూ విరమించినారు

శ్రీ సర్వేశ్వరానందగిరి స్వాములవారు మాట్లాడుతూ జంగయ్యను నేను 12 సంవత్సరాల క్రితం దేవరకొండ తాలూకాలో వారంరోజులు జరిగిన నా ఉప

న్యాసాల సందర్భంలో చూచినాను అయన నన్ను చేరి చాలా విషయాలు అడిగి తెలుసుకున్నారు ఈ సాహిత్య రంగంలో ఎంతో ముందుకు సాగిపోయినా రంటూ తనకు మిత్రుడైన శ్రీ కె రాధాకృష్ణయ్యా గారికి కృతి అంకితం కావడం బహుధా ప్రశంసనీయ మని వస్తుగుణ ప్రభావాలను సమీక్షిస్తూ ఈ లోకం ఈశ్వర ద్రవ్యం అది ఎవడైనా అనుభవించేంత వరకే తనదని ఆ తర్వాత గల ద్రవ్యమంతాయూ ఈశ్వరు నిదేనని అనేక మహత్తర విషయాలను ప్రబోధించి నారు

కృతి ప్రశంస చేస్తూ డా తిరుమల శ్రీనివాసా చార్యులుగారు జంగయ్య సాహిత్య జీవనాన్ని రసభరి తంగా సొగసుగా-లోతుగా ఉందని శారదాంబ పద్యా లను ఉదహరిస్తూ బహు చక్కగా మాట్లాడినారు సాహిత్య-సాంఘిక-రాజకీయ విషయాలను స్పందించిన తీరులో బహు చమత్కారజన్యంగా ఈ గ్రంథాన్ని రూపొందించినారని ప్రశంస చేసినారు

అధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు-తొలిపలుకుల్లో జంగయ్యగారితో 30 సంవత్సరాల సాహిత్య సంబంధాన్ని స్నేహాన్ని పేర్కొంటూ అతణ్ణి ఈడుతో పొల్చుకొని బుద్ధితో ప్రవర్తనతో మాకత్యంత ప్రేమపాత్రుడు స్నేహితుడు అని ఆయన సాహిత్య రజతోత్సవాలకు గౌరవాధ్యక్షునిగా ఉండినా ఆయనపట్ల ఎనలేని ప్రేమగల శ్రీ జూలూరు వీరేశ లింగం శ్రీ కె ఎ గుప్త వంటి ప్రముఖులు బాగా తోడ్పడినారని జంగయ్యగారి సృజనాత్మక సాహిత్యం ఆంధ్ర పాఠకులు, కవి పండితులు చదివి వెల్లడించిన అభిప్రాయాలే తార్కాణాలంటూ ఆయన నన్ను ప్రేమతో బంధిస్తాడని నిరంతరం కలుస్తూ సాహిత్య సంభాషణలనే చేస్తాడని నేనంటే ఆయన కేర్పడిన ప్రేమను గుర్తించక తప్పలేదని స్పష్టం చేస్తూ ఈ పరిషత్తుకు తన సేవలను ఆర్థికంగాను అందించినాడని పరిషత్తు అంటే తన మప్పై సంవత్సరాల సాహిత్య జీవనానికి ఆధారనిలయం అంటాడని-జంగయ్య-ముఖ్య అతిథిగా విచ్చేసిన శ్రీ రోశయ్య (హోం మంత్రి) గారిని కృతిని స్వీకరించిన రాధాకృష్ణయ్యగారిని దాశ రథిగారిని సర్వేశ్వరానంద స్వాములవారిని సంభా వించి సెలవు తీసుకున్నారు

శ్రీ రంగనాథాచార్యులుగారు స్వాగతంలో-వందన సమర్పణంలో జంగయ్యతో పాతిక సంవత్సరాలుగా తనకు గల పరిచయాన్ని సాహిత్య సేవనాన్ని చాలా దగ్గరగా చూసినాను సంభావించి పరిషత్తులోనే తన కృతులు ఆవిష్కరింపబడినాయని ఆయన పరిషత్తు ద్వారానే పైకి వచ్చినాడని ఆయన సాహిత్యజీవనం ఒక ప్రత్యేకమైనదిగా తనకు గల కొన్ని స్థిరమైన అభిప్రాయాలు గలదిగా చెబుతూ ఈ రంగంలో చాలా మంది కంటే నయమనిపించే రచనలు ముద్రించి మనముందుంచినారని చెబుతూ వందన సమర్పణ ముగించారు

## చిద్విలాసం ఆవిష్కరణ సభ హైదరాబాదు

25 11 1982వ తేదీన ఆంధ్ర సారస్వత పరి షత్తు ప్రాంగణంలో ప్రముఖ కవి శ్రీ నీలా జంగయ్య రచించిన చిద్విలాసం ఆటవెలది 'ల ఆవిష్కరణ, అంకితోత్సవం శ్రీ దేవులపల్లి రామానుజరావుగారి అధ్యక్షతలో జరిగింది

ప్రార్థనతో ప్రారంభమయిన ఈ సభకు ముఖ్య అతిథిగా విచ్చేసిన మాన్యశ్రీ విద్యాశాఖామాత్యులు డా॥ వై ఎస్ రాజశేఖర రెడ్డిగారు మాట్లాడుతూ ఈనాటి యువతరాన్ని సాహిత్యంపట్ల ఆసక్తి కలిగే టట్లు రచనలు చేయవలసిన బాధ్యత నేటి కవులపై ఉంది అన్నారు ప్రజల భాషలో ప్రజలకు అందే టట్లు వ్రాసిన ఈ చిద్విలాసం కృతి ప్రముఖ కవి

అయిన శ్రీ ఉండేల మాలకొండారెడ్డి గారికి అంకితం కావడం హర్షించదగింది అందుకు శ్రీ జంగయ్య గారిని అభినందిస్తున్నాను

కృతిని ఆవిష్కరించిన శ్రీ గజ్జెం మల్లారెడ్డిగారు కృతి ప్రశంస చేయనంటూనే కృతికర్తకు ఆవేశం పాలు ఎక్కువ అన్నారు పైగా కవి అని ఒప్పుకున్నారు

శ్రీ జంగయ్యగారు కృతిని శ్రీ మాల కొండారెడ్డి గారికి అంకితమిస్తూ నూతన వస్త్రాలంకృతునిచేశారు వారి కృతిపతికి గల అర్హతను కొనియాడుతూ దానికి మురిసిపోయారు ఈ సందర్భంలో అంకితం పద్యాలను తమ సహజ ధోరణిలో వీనులవిందుగా చదివారు

తరువాత శ్రీ ఉండేల మాల కొండారెడ్డిగారు కృతి కన్య నిచ్చిన శ్రీ జంగయ్యగారిని సముచిత రీతిని సత్కరించారు సాహిత్య బాంధవ్యంగా మా 30 సం॥ల మైత్రి నేడు మారింది అన్నారు

డా॥ ఏటుకూరి ప్రసాదుగారు శ్రీ డి గౌరిశంకర్ గారు కృతి ప్రశంస చేశారు

అధ్యక్షులు తమ తొలిపలుకులోనూ తుది పలుకులోనూ కూడా ముప్పయి సంవత్సరాలుగా సారస్వత పరిషత్తుతో సంబంధం ఉన్న శ్రీ జంగయ్యగారు దిన దిన ప్రవర్థమానులయినారని 1978 డిసెంబరులో వారి సాహిత్య రజతోత్సవం తాము గౌరవ అధ్యక్షులుగా ఉండగా జరుపుకోవడం కూడా జరిగిందని ఇవన్నీ తనకెంతో ఆనందదాయకమని శ్రీ దేవులపల్లి రామానుజరావుగా రన్నారు

**దేశ సమైక్యతకు దేశ సమగ్రత పరిరక్షణకు హిందీ మరియు దేశ భాషల వికాసము చాలా ముఖ్యం**

—పార్లమెంటు సభ్యులు శ్రీ యోగింద్ర శర్మ ఉద్ఘాటన

ది 4 12-1982 శనివారం దక్షిణ భారతహిందీ ప్రచార సభ ఆంధ్ర ద్వారా ఏర్పాటు చేయబడిన స్వాగత సభలో పార్లమెంటు సభ్యులు శ్రీ యాగీంద్ర శర్మ దేశ సమైక్యత పరిరక్షణకు దేశ స్వాతంత్ర్య రక్షణకు హిందీ మరియు దేశ భాషలను అభివృద్ధి పరచి వాటి ద్వారా భాషా సాహిత్యాలనే గాక మెడికల్ ఇంజనీరింగ్ మొదలైన కోర్సులను కూడా బోధించినచో ఒకవైపున దేశంలో సైన్సు టెక్నాలజీ మొదలైన విషయాలలో దేశీయుల ప్రతిభను పెంచడంతో పాటు ఇప్పటి పాశ్చాత్య దేశాలకు వలసపోతున్న ప్రతిభా పలాయానాన్ని కూడా అరికట్టవచ్చునని చెప్పారు హిందీకి గానీ ఇతర దేశ భాషల అభివృద్ధికి గానీ ప్రభుత్వం చేసే ఖర్చు వృధా కాదని దానివల్ల దేశానికి మేలు చేకూరుతుందని ఆయన నొక్కి చెప్పారు

పార్లమెంటు రాజభాషా సమితికి చెందిన రెండవ ఉప సమితి సభ్యులు హైదరాబాదు వచ్చిన సందర్భంలో దక్షిణ భారత హిందీ ప్రచారసభ-ఆంధ్ర వారికి స్వాగతమిచ్చి సన్మానించింది మొత్తం ఎనమండుగురు పార్లమెంటు సభ్యురు ఈ నెల 3, 4 తేదీలలో హైదరాబాదు నగరంలో రైల్వే పోస్టల్ టెలిఫోన్స్ మొదలైన కేంద్ర ప్రభుత్వ సంస్థలను దర్శించి వాటిలో హిందీ వాడకానికి సంబంధించిన

అభివృద్ధి తెలుసుకున్నారు దక్షిణ భారత హిందీ ప్రచార సభ ఆంధ్ర ఏర్పాటు చేసిన సభలో పార్లమెంటు సభ్యులు శ్రీ ఎన్ ఆర్ మిర్ధా శ్రీ రామావతారశాస్త్రి కూడా పాల్గొన్నారు ఈ సభకు అధ్యక్షత వహించిన హిందీ దినపత్రిక మిలాప్ సంపాదకుడు శ్రీ యుద్ధ వీర్ హిందీ మరియు దేశభాషల అభివృద్ధి ఆవశ్యకతను నొక్కి చెప్పారు సభ ప్రారంభంలో శ్రీ చిర్రావూరి సుబ్రహ్మణ్యం వేమూరి ఆంజనేయశర్మ దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్రప్రదేశ్ లోనూ మొత్తం దక్షిణాది రాష్ట్రాలలోనూ హిందీ ప్రచార ప్రసారాలకు చేస్తున్న కృషిని వివరించి చెప్పారు పార్లమెంటు సభ్యులు సభ కృషిని కొనియాడారు దక్షిణ భారత హిందీ ప్రచారసభ హైదరాబాదు స్నాతకోత్తర కాంప్లెక్స్ ప్రొఫెసర్ డాక్టర్ ఇంద్రనాథచౌదరి వందనసమర్పణ చేశారు

## చైతన్యభారతి నిర్మల్

అదిలాబాదు జిల్లా నిర్మల్ పట్టణ చైతన్యభారతి సాహితీసంస్థ ప్రథమ వార్షికోత్సవం అక్టోబర్ 31 వ తేదీన తెలుగు రీడర్ డాక్టర్ తిరుమల శ్రీనివాసాచార్యులు అధ్యక్షతన మహావైభవంగా జరిగింది జిల్లా సప్లయ్‌ఆఫీసర్ శ్రీ అంబరీష్ ఉషోదయం అనువార్షిక సంచికను శ్రీ ఎ వి జయవీరరాజు రచించిన చారుచర్య నీతి శతకమును సమితి అధ్యక్షులు శ్రీ జి వి నరసారెడ్డి ఆవిష్కరించారు ఉషోదయం గురించి శ్రీ ఏ సూర్యప్రకాశ్ చారుచర్య నీతిశతకం గురించి శ్రీ గణపతి రామచంద్రరావు వివరించారు అధ్యక్షులు శ్రీ టి లక్ష్మీనరసింహస్వామి శ్రీ ఎ వి జయవీరరాజును సన్మానించి సంస్థను పరిచయం చేశారు ప్రధానకార్యదర్శి శ్రీ చిరుత నర్సయ్య వార్షిక నివేదిక చదివారు కవిసమ్మేళనంలో పాల్గొన్న 20 మంది కవులకు అతిథులకు మెమెంటోలు ప్రధానం చేశారు సమావేశకర్త శ్రీ డి నారాయణగౌడ్ స్వాగతం పలికారు సహాయ కార్యదర్శి శ్రీ అంకము రాములు అతిథులకు పూలమాలలు వేశారు ఉపాధ్యక్షురాలు శ్రీమతి జె అరుంధతిశర్మ వందనసమర్పణ చేశారు

## స్వాతంత్ర్య సమరయోధునికి సన్మానం

### నెల్లూరు

13 11-82వ తేది శనివారము సాయంత్రము 4 00 గం లకు శ్రీ సర్వోదయ కళాశాల నూతన భవనములో హిందీ ప్రచారకుడు స్వాతంత్ర్య సమర యోధుడు సంఘ సేవా పరాయణుడైన శ్రీ పుత్తేటి సుబ్రహ్మణ్యాచార్యులు గారికి సన్మానము జరిగినది శ్రీ సర్వోదయ కళాశాల సెక్రటరీ మరియు కరెస్పాండెంట్ గారైన శ్రీ ఎ ఎ సుబ్బరాయులు శెట్టిగారు అధ్యక్షత వహించిరి షుమారు 200 మంది హిందీ పండితులు అభిమానులు పై సభలో పాల్గొనిరి వి ఆర్ కళాశాల హిందీ విభాగ అధ్యక్షులు శ్రీ ఎ వీరయ్యగారు వివిధ క్షేత్రములలో అతిథి యొక్క సేవాపరాయణతను కార్యదక్షతను సంఘసేవను గూర్చి ప్రసంగించిరి ప్రసిద్ధ రచయిత విమర్శకుడు శ్రీ మరుపూరు కోదండరామిరెడ్డిగారు అతిథి యొక్క యోగ్యత ఆదర్శములను కొనియాడిరి తదుపరి తెలుగులోను హిందీలోను అనేక మంది ప్రసంగించిరి ప్రచారక మండలి అధ్యక్షులు శ్రీ సుంకర చంగయ్యగారు అతిథికి శాలువనుకప్పి సన్మానించారు ప్రచారక మండలి కార్యదర్శి శ్రీ ఎ వెంకట సుబ్బయ్యగారి వందన సమర్పణ అనంతరము జాతీయ గీతముతో సభ ముగిసినది

# శ్రద్ధాంజలి - సంతాప సభలు

## ప్రేమ్‌చంద్ వర్ధంతి

ప్రేమచంద్ రచనలు కేవలము మనోరంజక మునకై కాలక్షేపమునకు పనికి వచ్చునవి కావని దేశభక్తి పూరితములై ఉన్నతాదర్శ పోషకములై భారతీయ సంస్కృతిని భారత ప్రజల సహజ దార్శనిక ప్రవృత్తిని ప్రతిఫలింప జేస్తున్నాయని మొన్న అవనిగడ్డ గాంధీ క్షేత్రములో హిందీ ప్రచారక విద్యాలయం ఆధ్వర్యములో జరిగిన ప్రముఖ హిందీ నవలా రచయిత ప్రేమ్‌చంద్ వర్ధంతి సభలో ముఖ్య అతిథిగా పాల్గొన్న కవి పండితులు శ్రీ జోస్యుల సూర్యనారాయణమూర్తి పేర్కొన్నారు ప్రేమ్‌చంద్ రచనలపై గాంధీ ఉద్యమాల ప్రభావము కలదని ఆయన అన్నారు

సభకు అధ్యక్షత వహించిన హిందీ ప్రచారక విద్యాలయం ప్రిన్సిపాల్ శ్రీ కప్పగంతుల సత్యన్నారాయణ ప్రేమ్‌చంద్ ఆదర్శవాది అని అన్నారు కథా సాహిత్యమును సానలుతీర్చి వన్నెబెట్టి దానికొకసుస్థిరమైన స్థానమును సంక్రమింపజేసిన ఖ్యాతి మహారచయిత ప్రేమ్‌చంద్‌కు దక్కుతుందని ప్రశంసించారు

శ్రీ ఎ వి ఎన్ ఆర్ శర్మ వందనసమర్పణ చేశారు

## కరీంనగరంలో వినోబాజికి శ్రద్ధాంజలి

నవంబర్ 26న కరీంనగరములో జిల్లా సర్వోదయ మండలి పక్షమున శ్రీ వై హనుమంతరావు అధ్యక్షతన జరిగిన సమావేశములో వివిధ మతములకు చెందిన ప్రార్థనలు సామూహికముగా జరుపబడినవి జిల్లా సర్వోదయ మండలి అధ్యక్షులు శ్రీ బి వెంకటరామారావు ప్రసంగిస్తూ ఆచార్య వినోబా భావేగారు గాంధీజీకి ఆధ్యాత్మిక వారసుడనియు ప్రథమవ్యక్తి-సత్యాగ్రహుడనియు స్వాతంత్ర్య సమరయోధుడనియు సర్వోదయ సమాజ స్థాపకుడనియు భూదాన గ్రామదాన యజ్ఞకర్తయనియు ఆర్థిక సాంఘిక సమానత్వము కొరకు శాంతియుత మార్గమున కృషి సల్పిన యుగప్రవక్తయును మహర్షి యనియు అన్నారు పలువురు ప్రముఖులు వక్తలు ప్రసంగించి వినోబాజీ చిత్రపటమునకు పూలమాలలు సమర్పించి శ్రద్ధాంజలి ఘటించారు

అంతకు ముందు జిల్లా కాంగ్రెస్(ఐ) అధ్యక్షులు శ్రీ బి రామస్వామి అధ్యక్షతనజరిగిన సమావేశములో రాష్ట్ర న్యాయశాఖా మంత్రి శ్రీ వి వెంకటేశ్వర్‌రావు వినోబాజీవంటి మహర్షి నిర్యాణము పొందుటతో ఒక యుగము అంతరించినదంటూ శ్రద్ధాంజలి ఘటించారు

సర్వశ్రీ బి కోటేశ్వర్‌రావు యస్ సత్యనారాయణ బ్రహ్మచైతన్య చీటి జగన్‌రావు కె రామలింగం వి రామేశం కె చంద్రమోహన్‌రావు వి రామారావు శ్రీమతి గ్రంథి రాజేశ్వరమ్మ ప్రభృతులు కూడా ప్రసంగించి శ్రద్ధాంజలులు ఘటించారు

## డా॥ ఏ బి నాగేశ్వరరావు నిర్యాణం

### రాజమండ్రి

13-12-82 రాజమహేంద్రి హిందీ ప్రేమీ మండలి ఆధ్వర్యమున దేశభక్తులు, గాంధేయవాదులు హిందీ ప్రేమీ మండలి పూర్వాధ్యక్షులు స్వర్గీయ డా॥ ఏ బి నాగేశ్వరరావు గారి మరణానికి సంతాప సభ శ్రీ ఎ ఆర్ జైన్ (ఎ ఎ ఎ మిల్సు) అధ్యక్షతన జరిగినది

ప్రేమీ మండలి కార్యదర్శి శ్రీ మరపల సన్యాసిరావు "స్వర్గీయ నాగేశ్వరరావు గారి జీవిత చరిత్రను సంగ్రహంగా వివరిస్తూ హిందీ ప్రచారానికి వారు చేసిన అమోఘ సేవకు జోహార్లు అర్పించారు

అధ్యక్షులు శ్రీ ఎ ఆర్ జైన్ శ్రీ నాగేశ్వరరావు గారి చిత్రపటానికి పూలమాలలు సమర్పించి పూజచేసి శ్రీ నాగేశ్వరరావు కర్మయోగి త్యాగ

మూర్తి గాంధీజీ ఆశీస్సులకై జీవితం ధారపోసిన మహావ్యక్తియని దేశ స్వాతంత్ర్య సంగ్రామంలో డాక్టరుగారి చరిత్ర సువర్ణాక్షరాలతో లిఖించబడి వుంటుందని అంటూ అశ్రుతర్పణ చేసారు శ్రీతా హరికృష్ణారావు (అడ్వకేటు) శ్రీ నాగేశ్వరరావు గారు ఆంధ్ర కేసరికి అనంగు శిష్యులై ఒకే సిద్ధాంతముపై కట్టుబడి నిస్వార్థ సేవకు అంకితమైన మహామనీషి అని అన్నారు శ్రీ రాయపూడి రామకృష్ణ (స్వాతంత్ర్య సమరయోధులు) మాట్లాడుతూ బ్రహ్మజోశ్యుల ఉన్నత, తెనేటి వంటి గాంధేయవాదులతో కలిసి పనిచేసి నిర్మాణ కార్యక్రమాలలో హిందీ ప్రచారము ఒకటిగా తీసుకొని జీవిత పర్యంతం హిందీ ప్రచార సభకు హిందీ ప్రేమీ మండలికి సేవచేశారని అన్నారు శ్రీ వేమూరి సాంబశివశాస్త్రి రాజమహేం ద్రికి కష్టాలు వచ్చినప్పుడు నిస్వార్థ చింతతో ముందు వుండి నాయకత్వం వహించి ప్రజలకు సేవచేసిన మహాదేశభక్తుడు అని అన్నారు

శ్రీ ఆర్ కె పురోహిత్ (పేపర్‌మిల్సు) తమ దుఃఖాన్ని వ్యక్తపరుస్తూ భౌతిక దేహం శాశ్వతం కాదు కాని వారి ఆత్మ ప్రభావం వలన యువతకు చైతన్యం దేశభక్తి ప్రేరణ జరిగిందని వారి త్యాగాల వలన మనం ఉత్తేజులైనామని అన్నారు

సభలో కె నాగేశ్వరరావు గారి ఆత్మకు శాంతిని కోరుతూ సర్వశ్రీ ఎ ఆర్ జైన్ ఆర్ కె పురోహిత్ కుమారి సుబ్బలక్ష్మి హిందీ కవితలు చదివి దుఃఖాన్ని వ్యక్తపరచారు

ఇంకా హిందీ మహా విద్యాలయ విద్యార్థులు విద్యార్థినులు రామధున్ పాడి శ్రీ నగేశ్వరరావు గారు శ్రద్ధాంజలి ఘటించారు

కుమారి సుబ్బలక్ష్మి వందన సమర్పణ చేశారు

## గాంధీ జయంతి చిత్తూరు

అక్టోబరు 2వ తేదీన చిత్తూరు హిందీ ప్రేమీ మండలి మహా విద్యాలయములో గాంధీ జయంతి ఉత్సవము జరిగింది మండలి అధ్యక్షులు శ్రీ డి శ్రీనివాస అయ్యంగారు జాతీయ పతాకమును ఎగుర వేశారు గాంధీగారు భారత జాతి దాస్య విముక్తికి పోరాటము గావించారు వారి అడుగుజాడలలో అనేక మంది దేశభక్తులు నడిచారు ఎన్నో కష్టనష్టాలకు గురి అయ్యారు ఆ మహానుభావుడు సంపాదించిన స్వాతంత్ర్యమును భావి పౌరులైన మీరు కాపాడ కొన వలెను ఈ దేశాభ్యున్నతి మీమీదనే ఉన్నది మీరు గాంధిగారివలే దేశసేవకు పూనుకొనవలెను అని ఆయన హితబోధ చేశారు మండలి కార్యదర్శి శ్రీ బి జి సుందరమూర్తిగారు గాంధీగారికి అతి ప్రియ మైన రాంధున్ రఘుపతి రాఘవ రాజారాం పాటను సామూహికంగా గానం చేశారు జాతీయగీతముతో సభ ముగిసెను

## కరీంనగరంలో గాంధీ జయంతి

అక్టోబరు 2న గాంధీ జయంతి సందర్భమును పుర స్కరించుకొని కరీంనగరములో జిల్లా సర్వోదయ మండలి పక్షమున శ్రీ బోయినపల్లి వేంకట రామారావు అధ్యక్షతన జరిగినది ప్రముఖ స్వాతంత్ర్య సమర యోధుడు శ్రీ వై హనుమంతరావు గాంధీజీ చిత్రానికి పూలమాల వేసిరి పలువుర వక్తలు ప్రసంగిస్తూ గాంధీజీకి శ్రద్ధాంజలి సమర్పించిరి

## శ్రీమతి ఇందిరా గాంధీ జన్మదినోత్సవం

## విజయవాడ

19 11-82న 10 గంటలకు హిందీ ప్రచారక విద్యాలయము మాచవరంలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ అధ్యక్షురాలు భారత ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ 65వ జన్మదినోత్సవము ఉత్సాహపూరిత వాతావరణంలో జరిగింది ముఖ్య అతిథి శ్రీమతి సీతా రామరాజుగారు ఉపన్యసిస్తూ "మన దేశ జనాభాలో స్త్రీలు సగము ఉన్నారు వారు విద్యను బడసి చైతన్యవంతులగుట అవసరము

అప్పుడే సమాజము పురోగమిస్తుంది అని చెబుతూ శ్రీమతి ఇందిరా గాంధీ పుట్టినరోజు సందర్భములో టైలరింగ్ నేర్చుకుంటున్న విద్యార్థులందరికి తమ శుభాకాంక్షలు అందచేశారు

ప్రముఖ స్వాతంత్ర్య యోధులు శ్రీ అడుసుమల్లి లక్ష్మీ పెరుమాళ్ళుగారు మన భారత స్వాతంత్ర్య సంగ్రామములో ఎంతో త్యాగం చేసిన దేశభక్తుల కుటుంబము శ్రీమతి ఇందిరాగాంధి గారిది ఆమె పుట్టిక పోరాటము మధ్యలో— ఆమె జీవితమూ పోరాటమే భారతదేశము సందేగాక ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఇందిరాజీ జన్మదినము మనకొక పెద్దపండుగ ఈ సందర్భములో అందరికీ నా శుభాకాంక్షలు- అన్నారు

శ్రీ ఎ ప్రసాదరావుగారు శ్రీమతి ఇందిరాగాంధి గారి జీవితాన్ని క్లుప్తముగా చెప్పారు సభాధ్యక్షులగు ప్రిన్సిపాల్ సుబ్బారావుగారు దక్షిణ భారత హిందీ ప్రచార సభకు శ్రీమతి ఇందిరా గాంధీ అధ్యక్షురాలు ఆమె భారత ప్రధాని కూడాను ఈ సంవత్సరములో భారతదేశము సర్వతోముఖముగా అభివృద్ధిని సాధించాలని ఆమె దేశప్రజలను కోరింది అన్నారు ఈ సంవత్సరం ప్రచారక విద్యాలయ పాఠ్యక్రమములో హిందీ భాషా శిక్షణతోపాటు బైండింగు కుట్టుపని హిందీ టైపింగు కూడా నేర్పుటకు సహాయపడవలసిందిగా ముఖ్య అతిథిని, సర్వోదయ సంఘమును కోరుతూ విద్యాలయ రిపోర్టును సమర్పించారు

సర్వోదయ మండలి కార్యదర్శి శ్రీ శీరపు అప్పారావు బైండింగ్‌కు తమ ప్రోత్సాహమును తెల్పిరి శ్రీమతి సీతాకామరాజు కుట్టుపనికి తోడ్పాటును తెలియబరుస్తూ విజయవాడలో హిందీ మీడియం డిగ్రీ కాలేజీ అవసరాన్ని బలపరచారు తరువాత వందన సమర్పణతో సభ జయప్రదంగా ముగిసింది

## ప్రమాణపత్ర వితరణోత్సవము

## దేవరాపలి

తే 22-11 82 సోమవారము సాయంత్రము 4 గంటలకు విశాఖపట్నం జిల్లా దేవరాపల్లి గవర్నమెంటు జూనియర్ కళాశాల యందు 9 10వ హిందీ ప్రమాణపత్ర వితరణోత్సవ సభ అత్యంత ఆనందభరితంగా జరిగినది పలువురు విద్యావేత్తలు, అభిమానులు విద్యార్థినీ విద్యార్థులు విచ్చేసి సభను జయప్రదము గావించిరి

ఆనాటి సభకు స్థానిక ప్రిన్సిపాల్ శ్రీ మంగళంపల్లి రామకృష్ణారావు ఎమ్ ఎస్ సి బి ఇ డి గారు అధ్యక్షత వహించి అధ్యక్షులు వారి అధ్యక్షోపన్యాసములో హిందీ భాషా ప్రాముఖ్యతను చెబుతూ హిందీ ప్రచారకులు చేయుచున్న ప్రచారముగురించి ప్రశంసించిరి హిందీ ప్రచారకులు శ్రీ చందిక సత్యనారాయణగారు ఫలాపేక్ష లేకుండ నిర్విరామముగా 15 సంవత్సరముల నుండి హిందీ ప్రచారము చేయుచు వేలాది మంది విద్యార్థులను ప్రాథమిక నుండి ప్రవీణ వరకు పరీక్షలకు శిక్షణ ఇచ్చుచు కొంతమంది హిందీ పండితులను తయారు చేసిన ఘనత పొందిరి వారి సేవలకు గుర్తింపుగా దక్షిణ భారత హిందీ ప్రచార సభ మద్రాసువారు దేవరాపల్లి పురజనులు కాలేజి కమిటీవారు సన్మానము చేసిరి

ఆనాటి సభకు ముఖ్య అతిథిగా విశాఖ జిల్లావిద్యా శాఖాధికారి శ్రీ జె న రంగనాయకులు ఎమ్ ఏ బి ఇ డి గారు విచ్చేసిరి వారు తమ ఉపన్యాస ములో ఈనాడు హైస్కూలులో హిందీకి ఉన్నత స్థానమును చక్కగా వివరించిరి హిందీ భాష బోధ నకు సరిపోయెడి పీరియడ్‌లు హిందీ ఉపాధ్యాయు లకు లభించుటలేదని చెప్పిరి దాని వలన హిందీ భాష కొంతవరకు వెనుకబడినది అనిచెప్పిరి ఏస్కూలులో హిందీ పరీక్షల సెంటరు నడుచునో అక్కడ కొంత వరకు ఎల్లలు హిందీ భాషను బాగా నేర్చుకొను చున్నారు ఈ విషయములో స్థానిక హిందీ ప్రచారక్ శ్రీ చందక సత్యనారాయణ హిందీ భాషకు చేయు చున్న సేవ ప్రశంసనీయమైనది హిందీ భాషకు భార తీయ భాషలకు ఉన్న సంబంధమును వర్ణించుతూ హిందీ భాషను అందరు నేర్చుకొనవలెనని చెప్పిరి

ఈనాటి ప్రమాణపత్రవితరణోత్సవము నాకు చాలా ఆనందమును కలిగించినదని వ్యాఖ్యానించి చెప్పిరి

ఈనాటి సభకు ప్రముఖ ఉపన్యాసకులుగా శ్రీ డా ఎ ఎ రాజుగారు (హిందీ రీడరు ఆంధ్ర యూని వర్సిటి) విచ్చేసిరి! వారు తమ ఉపన్యాసములో ఎన్ని భాషలు నేర్చుకొంటే అంత ఆనందము పొందవచ్చు నని వ్యాఖ్యానించి చెప్పిరి వివిధ భాషలు వాటి సాహి త్యము తెలుసుకున్ననాడు మన భారతదేశము యొక్క గొప్పతనమును మనము తెలుసుకొనగలము హిందీ భాష నేర్చుకొనుటలో భావ సమైక్యతను సాధించవచ్చు నని చెప్పిరి శ్రీ చందక సత్యనారాయణ హిందీభాషా ప్రచారమునకు చేయుచున్న సేవను ప్రశంసించిరి హిందీభాష విషయములో గంభీరమైన ఉపన్యాసమును ఇచ్చి శ్రోతలను ముగ్ధులను గావించిరి

శ్రీరాచకొండ లక్ష్మణమూర్తిగారు లెక్కల లెక్చ రర్ శ్రీ L H ప్రసాదుగారు హిందీ భాష ప్రాముఖ్యతను గురించి విద్యార్థులు హిందీ భాషనేర్చు కొను ఆవశ్యకత గురించి గంభీర ఉపన్యాసములు ఇచ్చిరి శ్రీ L H ప్రసాదుగారు ఉపన్యాసము విద్యార్థులలో ఉత్సాహము హిందీభాష నేర్చుకొనుటకు ప్రోత్సాహము కలిగించినది

తరువాత స్థానిక హిందీ ప్రచారకులు శ్రీ చందక సత్యనారాయణగారు తన వార్షిక రిపోర్టు చదివి విని ంచిరి అటుఎమ్మట ఇంగ్లీషు లెక్చెరర్ శ్రీ ఇ శశి భూషణరావుగారు మృదుమధుర శైలిలో సభికులను ముగ్ధులను చేయుచు వందనసమర్పణ గావించిరి జణ గణమనతో సభ రాత్రి 8 గంటలకు ముగిసినది



దక్షిణభారత హిందీ ప్రచార సభ ఉచ్చ శిక్షా ఔర్ శోధ్ సంస్థాన (స్నాతకోత్తర విభాగం)
రాష్ట్ర భాషా పారంగత్ పరీక్ష ఉస్మానియా యూనివర్సిటీ మాన్యత

Telegram University

OFFICE OF THE REGISTRAR
OSMANIA UNIVERSITY
HYDERABAD 500007

No 6559/L/1507/II/[illegible]/Acad Dated 18-12-1982

To
The Dean
Faculty of Arts
Osmania University
Madem

Sub Recognition of Rashtra Bhasha Parangat Examination Conducted by Dakshina Bharat Hindi Prachar Sabha Madras as equivalent to M A (Hindi) of Osmania Univirsity for appointment purposes as Junior Lecturers

Ref Letter No 125/HD/82 Dt 29 7 1982 from the Head Department of Hindi O U

* * * * *

With reference to the above letter I am to inform you that the Vice-Chancellor in anticipation of the approval of Standing Committee/Academic Council has accorded recognition to the Rashtra Bhasha Parangat Examination conducted by Dakshin Bharat Hindi Prachar Sabha Madras as equivalent to M A (Hindi) of Osmania University for the purpose of appointment as Junior Lecturers

Yours faithfully
Sd/- ASST REGISTRAR
(Acad)

Copy forwarded for information to

1 The Head Department of Hindi O U
2 The Director of Higher Education Andhra Pradesh Hyderabad
3 The Registrar Dakshin Bharat Hindi Prachar Sabha Madras
4 Registrar, Dakshin Bharat Hindi Prachar Sabha P G Complex Hyderabad
5 H Section Academic Branch O U

//True Copy//

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ - ఆంధ్ర

హైదరాబాద్ 500 004

## విజ్ఞప్తి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర గత చాల సంవత్సరాలుగా పనిచేస్తున్నది ఇది మన మాతృసంస్థ ఈ సంస్థ కేంద్రప్రభుత్వ సహాయంతో ఈ క్రింది ప్రణాళికలను అమలు బరుపుచున్నది

1 నాలుగు హిందీ మహావిద్యాలయములు
2 21 హిందీ విశారద విద్యాలయములు
3 4 హిందీ టైప్ రైటింగ్ విద్యాలయములు
4 270 ఉచిత హిందీ తరగతులు (సహాయక ప్రచారకులు)

ఆంధ్రసభ స్వంత ప్రణాళికలు

1 స్వతంత్ర ప్రచారక్ ప్రణాళిక
2 మాన్యత పొందిన హిందీ విద్యాలయములు
3 హిందీ పరిచయ్ పరీక్ష నడుపుట

ప్రచారకులకు లాభములు కేంద్ర ప్రభుత్వ ప్రణాళిక ననుసరించి పనిచేయువారికి కేంద్రప్రభుత్వ నియమముల ననుసరించి అనుదానము ఇవ్వబడును ఆంధ్రసభ స్వంత ప్రణాళికల ననుసరించి పనిచేయువారికి వాటి నియమముల ననుసరించి ఆర్థిక సహాయము చేయబడును (నియమావళులు పంపబడినవి) సభ పరీక్షలకు పరీక్షార్థులను తయారుచేయు ప్రచారకులనే (తగినంత సంఖ్య ఉన్నచో)పరీక్షకులుగా నియమించి ప్రోత్సహించుట జరుగును

ఆంధ్రసభ స్వంత ప్రణాళికలలో మీకు అనుకూలముగ నున్నదానిని మీరు ఎంచుకొని మాకు సూచించినయెడల వివరములు పంపగలము మీరు సభకు మీ సహకారము నందించి ఆర్థిక సహకారమును తప్పక పొందగలరు మీ స్కూలు గ్రంథాలయము నిమిత్తం హిందీ పుస్తకముల కొరకు సభకు వ్రాయండి మీరు కోరినట్లు మంచి పుస్తకములు ఎన్నిక చేసి పంపగలము

మీ జాబుకై ఎదురుచూచుచున్నాము

హైదరాబాదు
ది 20-11-1982

ఇటు
చిర్రావూరి సుబ్రహ్మణ్యం
కార్యదర్శి

Edited Printed and Published by Ch Subrahmanyam on behalf of the D B Hindi Prachar Sabha Andhra 959 Khairatabad Hyderabad 500 004
and Printed at Dakshina Bharat Press Hyderabad 500 004